# కలబోసిన ముత్యాలు

## సూక్తులు - సుధామయ కావ్య ఖండికలు

(బాల సాహిత్యము)

(ఆటవెలది, తేటగీతి పద్యాలలో)





దుర్గాప్రసాద్

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకళా తేజోమయి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందనమిదె! ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నతహిమ గిరిశిఖరము అమరిన శుభ కల్యాణి!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె! ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో! నా మాతృభూమి!

# దేవతా వందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని।
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత। అక్షరరూపిణీ భారతి।
లలిత లలిత పదశోభిని। లాలిత సుందర భాషిణి।

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి!
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ ! భూరికృపానంద లహరి!

లలితకళా నందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధాకలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా।

వాణీ! వీణాపాణీ। వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ। శుభదాయిని।
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక।

# వినయ వాక్యము

ఆట వెలది, గీతపద్యములలో రచింపబడిన యీ సూక్తుల నిధిని ఆంధ్ర భాషా సరస్వతికి నలుబది యొకటవ పూజా పుష్పముగా సమర్పించుకొను చున్నాను.

గత ముప్పది సంవత్సరములుగా తెలుగు భాషా బోధకునిగా పనిచేయుచు, ప్రతి దినము ప్రార్థనా సమయమునందు విద్యార్థులకు ఏదో ఒక సూక్తిని లేదా, ఉపదేశము ఒక విద్యార్థిచే ఉపన్య సింపజేయుటగాని, నల్ల బల్లపై వ్రాయుటగాని జరుగుచున్నది.

ఈ నీతి పద్యములు ప్రారంభమున బాలల కొఱకు ప్రారంభింప బడినను పెద్దవారికిగూడ ఉపయోగ బడునట్లు రచింపబడినవి. ఈ పుస్తకమునందు సూక్తులతో బాటు కొన్ని కావ్య ఖండికలుగూడ జేర్పబడినవి. దాదాపు వేయి పద్యముల పుస్తక ముగా రూపొందినది

ఈ గ్రంథములోని సూక్తులుగాని, కావ్య ఖండి కలుగాని బాలలకు లేదా చదువరులకు నే మాత్రము స్పందింప జేసినను నా కృషి ఫలించి నట్లుగా భావించుకుందును.

విద్యాధికారులకు యీ గ్రంథము ఏ మాత్రము స్పందింపజేసినను తమ పాఠశాల విద్యార్థులచే బఠింపజేయ గోరుచున్నాను. సగము ధరకే ఆ పాఠశాల విద్యార్థులకు అందజేయగలను.

గత 28 సంవత్సరాలుగా ఉపాధ్యాయ వృత్తిని ఆచరిస్తూ అనేక ఉన్నత పాఠశాలలలో బోధనా వృత్తిని ఆచరిస్తూ అనేకమంది ప్రధానోపాధ్యా యులు,సోదర ఉపాధ్యాయులతో సన్నిహితంగా పనిచేస్తూ వారి ఆదర సత్కారాలను పొందడం జరిగింది. వారందరికీ నా నమస్సుమాంజలులు. విద్యార్థులచేగూడ మిక్కిలి ఆదర సత్కారాలను గౌరవాన్ని అందుకోవడం జరిగింది. వారందరికీ ప్రేమపూర్వకమైన శుభాశీస్సులు.

ఈ సమయంలోనే 40 సాహిత్య గ్రంథములు రచించి, ప్రచురించడం జరిగింది వానిలో ఎక్కు

వగా లలిత గీతాలు, మీరాబాయి, శ్రీ అండాళ్ దేవి, కీ|| శే|| దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లను అనుసరించి వ్రాయబడినవి. ప్రముఖుల ప్రశంసల అందుకొంటినని. వీని వలనగూడ ఉపాధ్యాయ వృత్తితో బాటు ఆత్మతృప్తి లభించినది.

ఈ విధమైన ఉపాధ్యాయ వృత్తిని చేయడం ద్వారా నా జీవితం ధన్యమైనదిగా భావించుకొను చున్నాను.

జిల్లా విద్యాధికారులచే ఉత్తమ ఉపాధ్యాయునిగా ఎన్నికజేయబడి సన్మానింప బడితిని.

ఈ విధంగా ఉపాధ్యాయ వృత్తిని ఆచరింప జేయుటయే గాక, సారస్వత సేవగూడ జేయించి నందులకు చదువులతల్లి సరస్వతీదేవికి నా భక్తి పూర్వక నమస్కృతులు అర్పించుకొను చున్నాను.

—రచయిత

# స మ ర్ప ణ ము



భావి భారత పౌరులైన

నేటి

బాల బాలికలకు—

అరవిరసిన గులాబీల

అందాల పూగుత్తులతో

# కలబోసిన ముత్యాలు

## (సూక్తులు-సుధామయ ఖండికలు)

( ఆట వెలదులు-తేట గీతులు )

సారభూతమైన సకలమౌ జ్ఞానము
ఒక్క మాటయందు నొనర సూక్తి;
అట్టి సూక్తు లిలను నక్షయంబుగ గలవు
కొన్ని సూక్తు లలరి గూర్చినాడ!

సూక్తిమాలలందు సుందర మైనవి
గ్రహణ జేసినాడ! గ్రంథములను!
అంతరంగమందు నావిర్భవించిన
కొన్ని సూక్తు లిందు గూర్చినాడ!

కొన్ని సూక్తులిందు గూర్చినాడను మఱి
కావ్య ఖండికలలును గలవు కొన్ని!
చిట్టినగవు జిందు చిన్నారి బాలలు
కంద జేయుచుంటి యలరి ప్రీతి!

చిన్ని బాలలార! చేరి పఠింపుడు
రోజుకొక్క సూక్తి రూఢియలరి!
ఉదయ సంధ్యలందు నుదయించు సూర్యుని
వెల్గు రేఖలట్లు విరియ మనసు!

భాను కాంచి సోకి భాసిల్లు బద్మము
దగిలి చంద్రరేఖ తరుణి కలువ!
విరిసినట్టి విధము విలసిల్లు మనసులు
సూక్తి సుధను దగిలి సుందరముగ!

మాల గ్రుచ్చినట్టి మధురమౌ సూక్తులు
బాలలైన మీకు బహు విధముల!
మనసులు వికసింప మఱి జ్ఞాన ముదయింప
యర్పణంబు జేసి యలరుచుంటి!

నోటి జదువు దాని మనసున మధియించి
యంత రంగమందు నధివసింప!
ఆచరణము నందు నలర జేయుచు మీరు
మార్గదర్శు లగుడు! మహిని మెచ్చ!

సూక్తి సుధను గ్రోలి సురుచిర వక్తలై
తోటివారి యందు మేటి లగుచు!
కార్యదర్శు లగుచు గమ్యము గనుగొనుచు
అత్మశుద్ధి గనుడు లాలితముగ!

సురుచిర పదములను, సుందర భావాలు
మైత్రనైన మనసు పొత్తికలను!
రాగ తాళ లయల రంజిల్ల గొంతెత్తి
ఆట వెలది వోలె పాటపాడి!

కావ్య ఖండికలను గలబోసి సూక్తులు
మాలగ్రుచ్చి తేను మధురముగను!
చిన్ని బాలల కిది చేతి కందించితి
యెదను దాల్చి దివ్య సుధల దేల!

— రచయిత

# కలబోసిన ముత్యాలు

(ఆట వెలదులు)

( నీతి పద్యాలు )

శ్రీకరముగ వినుడు చిన్నారి బాలలు!
మధురమైన మంచి మాట వినుడు!
తేనెలొలుకు నట్టి తీయని బలుకుల
దెలియ నీతులెన్నొ తేటబఱతు!

మంచివాడు బలుకు మాధుర్య మొలుకగా
దురితు డెపుడు బలుకు దురుసుగాను!
చిలుక బలుకు గాద! చిత్రమౌ స్వరమున
కాకి బలుకు గాద! కఠినముగను!

కల్ల లాడబోకు గలుగునురా హాని
హాస్య మాడబోకు నాప దొచ్చు!
తీపి మాటతోని తేనెల నొలికించు
మాటలోనె గలదు మహిమ జగతి!

ఒక్క కోకిలమ్మ యొసగదా హాయిని
వేయి కాకులేల వీనుల రొద!
లాలితమును లేని లక్ష పాటల లేల?
మంచి బాలలార! మాట వినుడు!

ధనము ధనమటంచు దరిలేని యాశల
దల్లడిల్లు చుంద్రు ధరణి జనులు!
తేనె టీగల వలె హాని జెందుదురిల
మంచి బాలలార! మాట వినుడు!

మంచి చెడుగు లెపుడు మాయవు జగమున
నిజము కల్లలుండు నిఖిలమందు!
మంచి దారి నడిచి మన్నింపు మంచిని
సత్య మెపుడు నిలుచు నిత్యముగను!

విద్యయందు గలదు విమలమౌ జ్ఞానము
సర్వ సుఖములంద సాధ్యమగును!
విద్య లేనివాడు వింతయౌ పశువని
వసుధ యందు గలుగు వాక్కు వినవె?

దాన గుణము లేని ధనవంతు డెందుకు?
మంచి మనసు లేని మనుజు డేల?
సాధు గుణము లేని సర్వజ్ఞు డెందుకు?
పాడు బడిన యట్టి బావి రీతి!

తల్లి తండ్రి మాట దగ జవదాటక
యనుసరించు వాడె యమర వరుడు!
పుట్టినట్టి తనదు పుణ్య భూమిని భక్తి
పూజ సేయువాడు పుణ్యు డతడు

నిన్న పాఠ్యములను నేడెందు కనకుము
నిన్న నుండి కాదె నేడు పుట్టె!
నిన్న పాఠ్యములను నేర్పుగా జదివిన
నేటి పాఠమొచ్చు మేటిగాను!

మాతృ భూమి నెపుడు మఱువ బోకుము జిన్న!
జన్మనిచ్చి నట్టి పుణ్య భూమి!
ఎన్ని దేశములను నెంతగా దిరిగిన
కన్నతల్లి కంటె గలదె మిన్న?

మాతృ భూమి యెపుడు మధురమై యుండును
నెట్టి వానికైన దిట్టకైన!
ఉగ్గు బాలతోని యుయ్యాల లూగించి
పాడినట్టి యమ్మ పలుకు ప్రీతి!

చెడ్డవారితోని స్నేహంబు జేయకు
జెడును నీదు మంచి శీలమంత!
స్నేహమునను గాదె! శీల మశ్లీతలు
గలిగి యుండు జగతి కల్ల గాదు!

చిలిపి వానితోని స్నేహంబు సేయకు
మాట వచ్చు దుదకు మనసు నొచ్చు,
పూల దీవె గాలి చిలిపి స్నేహము జేసి
పూలు రాల తూలి పుడమి బడవె?

బడికి వేళకేగి పాఠ్యాంశముల బాగ
చదువ వ్రాయనేర్చి సద్గుణముల!
అలవడు లటులలరి యాట పాటల నేర్చి
నేర్పు మిగుల చిన్ని! నేర్చుకొనుము!

వెన్నపూస వోలె, వెలుగు దీపిక వోలె
కన్నతల్లి కెపుడు నుల్లమలర!
చిలిపి పనులు లేక చెంగల్వ దండలా
మెలగవలయు జనులు మెచ్చుకొనగ!

స్నేహితులను నెపుడు జీదరింపకు జిన్ని!
మల్లెపూవు వోలె మనసు జిందు!
ఆలల వోలె వెలిగి యాట పాటల జెలగి
కండ బలము బుద్ధి బలము నొందు!

దేశభక్తి గలిగి దీక్షతో నీవును
చేతనైన సేవ జేయవలయు!
మాతృభూమి నెపుడు మఱువ కూడదు సుమా!
కర్మభూమి నీదు జన్మభూమి!

తొలి ప్రభాత రేఖ తొంగి చూడక ముందు
నిదుర లెమ్ము జిన్ని! నేర్పు మిగుల!
భక్తితోడి పాడి భగవంతు కీర్తనల్
మాతృ వందనమును మఱువ వలదు!

అఱచి యఱచి యొరుల నారాటు బెట్టకు
చిటిలిపోవు మనసు జిన్నబోవు!
శాంతమునను గాదె సమకూరు పనులన్ని
మనసు లతికిపోవు మర్మముగను!

కంటి పాపకువలె కనవోయి దమ్ముల
కయ్య మాడకోయి! గాయ మగును!
ఇంటిలోని తగవు లిల్లిల్లు జేర్పకు
మమత చిటిలిపోవు, మచ్చ వచ్చు!

మంచి మాటలాడు మరియాద వీడకు
పెద్దలందు మిగుల ప్రీతితోని!
వినయ వాక్యములను విస్తారమగు ప్రేమ
నిలిచి యుండు ననుట నిజము గాదె!

కలిసి మెలిసి యుండు గలుగును సంపదల్
యిరుగు పొరుగుతోని యిచట నచట!
సంఘ జీవులంత సమతతో మెలగిన
యదియె స్వర్గభూమి యరయు మన్న!

గగనమంత తారలలుము కొన్నట్లుగా
కిరణ కాంతు లొలికి దీప్తి గాంచి!
మనుజు లంత గూడి మధుర జీవనమున
పుడమి యందు పూలు బూయ వలయు

అంతలేని బ్రదుకు నర్థంబు లేదోయి!
యంత యుండ వలయు నఖిల ప్రజకు!
ఒంటిగా బ్రదుకుచు నుంత జాలదు భువిని
పక్షిగూడ మఱియు బశువు గూడ!

సరసులు విరసులూ సంఘమం దుందురు
మంచి చెడ్డ దెలిసి మసలు మన్న!
హంస కొక్కెఱలను నరసి జూదుము జిన్న
రూప భేదములను రూడి బలుకు!

తుమ్మెద వలె నీవు దూలి నాట్యములను
పాట బాడ వలయు బ్రగతి గీతి!
చిన్ని నవ్వులతోని చిందులు ద్రొక్కుచు
బ్రదుకు బాటయందు బయన మగుము!

భావి భారతమున బంగారు బాబువై
బ్రతుకు బాట దెలిసి ప్రగతి దెలిసి!
జనుల కందఱకును జాగృతి గలిగించి
యశము గాంచవోయి! యలరి జగతి

మావి తరువు జూడు! మధురమౌ సొబగుల
కొమ్మ రెమ్మ జివురు కోటిపూలు!
మధుర ఫలము లుండు మానుగా దేశంబు
దలప వోయి యటులె తఱచి చూడు!"

దేశభక్తి గలిగి దేశము ప్రేమించు
దీక్షతోని దిశల దీన ప్రజల!
ఆర్తి బాపి వారి యారాటమును మాన్పి
కాంతి శాంతి గూర్ప కదము ద్రొక్కు!

కలల గాంచవోయి కమ్మని కలలను
దేశ ప్రజల ప్రగతి దీటు గాగ!
కలల నిజము సేయ కదిలిపో ముందుకు
త్యాగ నిరతితోని దీక్షతోని!

కొండ కోనలందు కోకిల పాడును!
మధుర గీతములను మాతృ భక్తి!
నీవు గూడ మాతృ నీరాజనము లిచ్చి
పాట పాడవోయి! పరమ భక్తి!

పూవు బరిమళించి పొందును వాసనల్
దూర దూరములను దోలకరించు!
నీలో తొంగి జూచు నిగ్గుల నన్నింటి
ప్రజల కందజేయు ప్రతిన గొనుము!

ఎన్ని శాస్త్రములను నెంతగా జదివిన
మనసు లేనివాడు మనిషి గాడు!
ఎన్ని వన్నెలున్న యెందుకు కొఱగాదు!
కాగితంపు పూవు కనులకింపు!

మనసు నింపి కొనుము! మధురమౌ ప్రేమతో
తీయ తేనెకన్న తీపికన్న!
మంచితనము బెంచు మాధుర్యమగు మాట
పలుక నేర్చుకొనుము! బరులు మెచ్చ!

ఎండుటాకు వోలె నెగసిపో బోకుమా!
నవ్వులాట జగతి నలిగె దీవు!
చిగురుటాకు వోలె జిత్రించు సందాలు
కవులు మెచ్చుకొనగ క్రాంతి గీతి

మనసు దీపమగును మధురమౌ కాంతులు
దివిని భువిని వెలిగి తేజమొసగు!
దీప కాంతి నీవు దివిటీగ జేదాల్చి
కాలు జీకటులను గడకు ద్రోలు!

విద్య యెందుకనిన వినయంబు గోలకురా!
మంచితనము మంచి మాట కొలకు!
పరుల మాయజేయ పరుల భీడింపగా
కాదు విద్య చిన్ని! కాదు! గాదు!

మతమటన్న యొకటె మానవత్వము సుమా!
మంచితనము తోని మసలుటన్న!
అన్ని మతము లొకటి! యన్నిటి లక్ష్యము
విశ్వశాంతి! ప్రేమ! విసర చిన్ని!

కోతికి వలె నీవు కొమ్మ కొమ్మన జేరి
చిలిపి పనులతోని చింపకోయి!
పూవులందు నెగురు బోలుపు తుమ్మెద వోలె
మధుర నాట్యములను మదిని నింపు!

వస్త్ర భూషణములు, వయ్యారి నడకలు
నందమనుచు దలచి యలరకోయి!
అంతరంగ మందు నందంబు నందంబు!
మంచి నడత నడిచి మసలు మన్న!

అందమునసె యుండు నానంద మంతయు
నదియె యమృతమని యార్యు లనిరి!
అణువు నణువున గల యందాలు గనవోయి!
చూపులోనె గలదు! చోద్యమంత

విశ్వ సుందరతను విమల సౌందర్యము
ప్రకృతి యందు గలదు పాల మనసు!
అర్చనలను జేసి యానంద బడవోయి!
తల్లివోలె నోడిని దలను జేర్చి!

అంధకార మనెడి యజ్ఞాన మందున
మునిగిపోకు చిన్ని! మొరటు వోలె!
జ్ఞాన దీపిక లిల జనియింప మనసున
పద్మమట్లు విరిసి ప్రతిభ జిందు!

హెచ్చు తగ్గులంచు నెంచబోకుము చిన్ని!
మనుజులందఱొకటి మమత జూడు!
కులము మతమనెడి కూడని భావాల
మనసు నుండి ద్రోలి మసలు మన్న!

మతములెన్ని యున్న మానవు లొకటేను
మాధవుండు నొకడె మహిత శక్తి!
మత విభేదములను మమతను ద్రుంపకు
దైవమనగ ప్రేమ! తఱచి గనుము!

పరమత విరసంబు బాపంబురా చిన్ని
మతము బోధ జేయు మమత సమత!
నీ సమాన మనుచు నిఖిల జీవుల జూడు!
నఖిల జీవులందు నాత్మ యొకటి!

తల్లి దండ్రి కంటె తన స్నేహితుని కంటె
గురువు గొప్పవాడు గూర్మి వినుము!
మనసునందు నున్న మలినము దొలగించి
వెలుగును వెదజల్లు వేల్పుగాదె!

గురువు బ్రహ్మ విష్ణు గూర్మి మహేశ్వరుం
డనెడి మాట వినవె! యార్య జనుల
జ్ఞాన దీపమిచ్చి జాగృతి బరచేటి
గురువు ఋణము దీర్ప తరమె జగతి?

మనసు నున్నదలపు మఱు మాట లేకుండ
నోట బలుక వలయు దీటుగాగ!
చేత జేయ వలయు జెన్నుగా నాతడే
మహిత జనులచేత మన్ననందు!

అనుగు స్నేహితులను సతి దూరమున నుంచి
క్రొత్తవారితోని బొత్తు సేయ!
తన వారలే తనకు దగ శత్రువు లగుదురు
జగతి రీతి దెలిసి చనుము జిన్న!

నీదు మాతృభూమి నీతిని, ఖ్యాతిని
మహిత సంస్కృతులను మఱువబోకు!
ఎన్ని దేశములకు నేగినా తిరిగినా
మాతృభూమి ఋణము మఱువరాదు!

ప్రాత ప్రాత యనుచు బరిహ సింపకు మోయి!
క్రొత్త క్రొత్త యనుచు గూడి జనకు!
పాత క్రొత్తలందు బరువంబు గ్రహియించి
పరుగు లెత్తవోయి! పథము దెలిపి!

నిజము బలికిన యెడ నిష్ఠూర మగునని
లోకమందు గలదు లోక యుక్తి!
అయిన గూడ నీవు నట్టిట్లు లొంగక
బలుక వలయు నిజము నులికి బడక!

కొండ కోనలందు కోకిల గొంతెత్తి
పాడుకొనును పాట పరవశమున!
ప్రకృతి యందములను బరికించి నీవును
బాడుకొనుము! ప్రగతి భ్రమర గీతి!

దూరమున కొండ దృష్టికి నున్ననై
కానబడును గాని కల్ల సుమ్మి!
వధసు యందు గలుగు వార్తల, వింతల
అదిరిబోకు! చెదిరి బెదిరి పోకు!

కల్ల నిజము లిలను గలిసి వర్తించును
మంచి చెడులు గూడ మహిత జగతి!
హంస పాలు, నీరు నరసినట్లుగ నీవు
కల్ల కపటములను గాంచ వలయు!

గుడిని, బడిని చిన్ని! కూరిమి గృహమందు
నాట పాటలందు నలరునట్లు!
క్రమము దప్పకుండ క్రమశిక్షణను గలిగి
మెలగ వలయు బరులు మెచ్చుకోగ!

నిండు కుండలోని నీరున్న యట్టుల
దొణకరాదు చిన్ని! బెణకరాదు!
ఎంత చదివిన మరి యెంత ధనమున్నను
నతిశయంబు వలదు! నదిరిపాటు!

మంచివారు బోవు మార్గము గమనించి
వారు బోవు దారి వాంఛ నిలుపు!
సంఘమునకు దారి సజ్జన మార్గమే
కష్ట నష్టము లిల గలుగు గాక!

మనసునందు నున్న మంచి తనమ్మును
బంచిబెట్టిన యది యుచితముగ!
పెరుగు గాని సుంత దరుగ దెన్నటికినీ
విద్య వోలె నదియు వృద్ధి జెందు!

విద్య విజ్ఞతలను వేగము గలిగించి
కాఱు చీకటులను గడకు ద్రోసి !
వెలుగుదీపికలను వేగము వెలిగించి
దీప్తి జేయవోయి దేశమందు !

వట్టిమాటలోని వయ్యార మొలికించి
దేశ భక్తుల మను వేషమూను !
నేతి బీరకాయ నేతల బరికింపు
దాపు జేరకోయి ! దగదు జెలిమి !

తోడి బాలకులను దోసంబు గనబోకు
తీయనైన ప్రేమ తీర్చిదిద్దు !
అన్నదమ్ములుగను నాత్మీయులుగనెంచి
యాదరించు చిన్ని! యనవరతము!

వసుధయందు బడిన వాననీటికి వోలె
బెదర నీకు నీదు జిన్ని మనసు!
చెఱువు నీటివోలె జెన్నుగా కాల్వలై
పరుల మేలుకొఱకు బాటు బడుము!

విద్యజేయు నిన్ను విజ్ఞానవంతుగా
పాలరాతి బొమ్మ బరగినటుల!
అఖిల జనులకనులు నలరి నిన్నేగనును
మధురమైన నీదు మాటవినగ!

మతము మత మటంచు మహిలోని కొంపలు
మతము చిటిలిపోవ మహి చరిత్ర
పరుల హితము జేయు పండుగే పండుగ
అదియె గొప్ప మతము నరసి గనుము!

చిన్నిమాట చాలు జీవునవ్వు దొలకింప
మంచి మాట చాలు మనసు బొంగ
అన్నిమాటలేల యలసట గలిగింప
చెడ్డ మాటలిలను జేటుదెచ్చు!

శీలమొక్కటున్న జెందును శుభములు
శ్రీలు దరికి జేరు జెందు కీర్తి!
వసుధయందు గలుగు వాంఛలు నెఱవేరు!
ఎదురులేదు వానికిద్ధరిత్రి!

ఇరుగు బొరుగు వారి నీసడింపకుమోయి
కయ్యమాడకోయి! కఠినయుక్తి!
మనసు దెఱచి వారి మన్ననసేయుము!
తోడు బడుము నీకు దోచినంత!

సాధుగుణము గలుగు సజ్జనసేవను
భక్తితోనిజేసి ప్రగతి గనుము!
మంచి మనసునందు మాధవరూపము
నిండు దనముతోని నిలిచియుండు!

మంచివారి నెప్పుడు మనసు నొవ్వగజేయు
కఠినమైన మాట బలుకరాదు!
మంచి మనసునందు మాధవ రూపము
నిండు దనముతోని నిలిచి యుండు!

మంచివారినెపుడు మనసు నొవ్వగజేయు
కఠినమైన మాట బలుకరాదు!
తీపి పలుకుతోని తేనెలు గురిపించి
పలుకవలయు భావ భక్తి మెఱయ!

నీతి వంతుడెపుడు నిక్షేపవంతుడు
నీతిలేనివాడు కోతిసుమ్మి!
నీతి గలిగి ధరను నిండు మనసు మెలగి
మార్గ దర్శివగుము మానవులకు!

మానవ సేవయే మాధవ సేవగా
మనసు నందు దలచి మర్మముగను!
దీన హీన జనుల దీక్షగా దరిజేరి
బాధ దీర్చి మంచి బాట జూపు!

గగన వీధి యందు గాంచరా పక్షుల
యలలవోలె పూల తెరలవోలె!
పయనమయ్యేటియా పద్ధతి గమనించి
మమత నేర్చికొనుము మనసునందు!

పసిడి కూడబెట్టి పొపులకిత్తురు
తాను తృప్తి వినడు ధర్మమిడదు!
లోభివాని గుణములో లోభత్వ మిట్టిది
కానలేడు తనదు కర్మగతిని!

వెలను గట్టి నిలిపి వెండిబంగారము
విక్రయింప వచ్చు వేడుకలర!
మంచి మనసుకుగల మహినింత ధరయస
విక్రయింపగలమె వెలనుగట్టి!

నోరులేని పశుల నిర్దయ జూడకు
కాఱుమాటలాడి కఠినముగను!
జీవులందఱి నిల జీవేశ్వరుడుగాడ!
పుట్టజేసె పుడమి భూరికృపను!

అన్నదమ్ములనుచు నఖిల లోకంబును
మనసునందు దలపు మధురముగను!
తీపి మాటతోని తేనెల నొలికించు
విడని స్నేహమునను వేడుకలర!

ఉన్నదాని నంత నుట్టిని బెట్టకు
గలిగినంత లోనె కాంక్షితులకు!
ఆశను విడనాడి యాకలి దీర్పుము
ముప్పు దెచ్చుకొనకు ముడుపు గట్టి!

జన్మనిచ్చినట్టి జనని కంటెను వేఱు
నాత్మ బంధువులిల యవనిలేరు!
ఎన్ని పూజలైన యెన్ని కానుకలను
మాతృ ఋణము దీర్పమనకు వశమె?

పూల దోటలోని పూవుల మొక్కల
ద్రుంపబోకు పూల దునుమబోకు!
చిన్ని పాపలనుచు జిన్నారి దీవెల
నీరు పోసిబెంచు నిండు ప్రేమ!

కొంచె బనులు జేసి కొంటి చూపులు 'జూచి'
మాట దెచ్చుకొనకు మహిత జనుల!
వినయము వికటించి విద్వజ్జనంబుల
దీవెనందు బోయి దీర్ఘ శ్రుతుల!

విశ్వమంత జూడ వేదనా మయమని
బలుకు చంద్రు కవులు ప్రజ్ఞమీర!
కాలచక్రము గాంచి కలగకు పొగలకు!
నిర్నిమేష దృష్టి నిలుపు శాంతి!

విషము నమృతంబు వేదన శాంతులు
నెదుటనున్న పాత్రలరయుమన్న!
ఎంచుకొనుము నొకటి యే పాత్రనైనను
కర్మఫలము నంద కర్తనీవు!

పోరు నష్ట మిలను పొందు లాభంబను
మాట వినమె జగతి మహిత జనుల!
పోరువలన పుడమి బుగ్గియైపోయిన
గత చరిత్ర వినమె? కథలయందు!

మాట నేర్పునేర్చి మర్యాదవర్తించి
సభలయందు వినయ సంపదయును!
గలిగి యుండదలయు కమ్మనివర్తన
బనుల చక్కజేసికొనగ వలయు!

పూలదారమువలె బొలుపున నుండుము
మంచివారితోని మతిని గలిపి!
అల్పుడైన నగును నంబరమున తార
మంచివారి మైత్రి మహినిబొంది!

తామర కుసుమంబు వగ బురదలో బుట్టి
వినుల పరిమళముల వేద్కవిరియు!
చరితులందు నున్న దుష్కర్మమారుడు
వనదు మతము విడునె దారిదప్పి!

ప్రశ్నయందు గలదు బహుమార్థ మంతయు
ప్రశ్న లేక నెద్ది బడయులేవు!
అడుగు ప్రశ్న నీదు నాచార్యదేవుని
తెలియలేని విషయ జాలిమంత!

అడిగి తెలిసికొనుము! సరతుర లేకను
చివటి ప్రశ్నవటుకు జింతవన్న!
మంచుపడిన యుదయ మధురసంధ్యకుపలె
వెలుగు దీపికలను దెలియవలయు!

ప్రమిదయందు నూనె వత్తిని వెలిగించి
దీపకాంతువెలమి దేజరిలగ!
చేయువాడు గరుడు! చేతన జాగృతి
సుప్రకాశ జ్యోతి దర్శనముల!

గురువు సేవజేయ గొప్పవాడగువాడు
గురుని నిందసేయ క్రుంగునతడు!
గురువు శిష్యులొకట గూడిన ప్రియమగు
వారికెవరు సాటి? పోటిలేదు!

మంచిమాట వినుము! మహిని రత్నము సుమ్మి!
యాదరమును బొందు నఖిల జగతి!
పిల్లదెమ్మెర వలె ప్రీతినిగూర్చును
మరువగలమె మంచిమనిషి నెపుడు?

పుట్టినందుకుగల పురుషార్థమునుగని
సకలజీవులందు సాధురీతి!
మెలగుట నేర్చుకో! మేలుగా నొకటయి
యాత్మభావమునను నలరుమోయి!

నీటిలోని కలువ నిర్మల శోభల
నొలికినటుల నీవు నిలిచి జగతి!
మానవత్వంబును మమత శాంతులు గలిగి
దీప్తిజెందవోయి! దిశలనన్ని!

శాంతి, సత్య, ప్రేమ, కాంతి వర్ధిల్లగా
భాసమానమగును! పద్మమట్లు!
ఉన్నతమగు మాన ఔన్నత్యమునకునై
తీర్చిదిద్దుకొనుము దేజరిలగ!

సుఖము దుఃఖముగల చోద్యమా జగతిని
వెలుగు జీకటులిలను వెతనుబెట్టు!
భావనిర్మలమును బరగ సాధించిన
యద్దులేని సుఖములందగలవు!

కిన్నెరందు దగిలి కీర్తన యున్నట్లు
మనిషియందు మంచి మనసు గలదు!
మంచి మనసు మాట మన్ననజేయుము!
హద్దులేని సుఖము లందగలవు!

సాధు సజ్జనులను సఖ్యంబు వదలకు
పుడమియందు పుణ్య పురుషులయును!
అవని యందు వారు నవతార పురుషులు
వారి భక్తి మ్రొక్కవలయు జిన్ని!

సుజన స్నేహమెపుడు సుఖము సౌఖ్యములను
నిహము బరమునిచ్చు నింపుగాను!
మనసున గలిగించు మధురమౌ కాంతులు
జ్ఞాన విజ్ఞతలను జతగ గూడి!

ఆత్మయందు జూచు నా పరంజ్యోతిని
నిత్యసత్యవ్రతుల నిర్మలముగ
సాధువర్తనులను సర్వసంపన్నుల
బరగు సజ్జనులకు ప్రణతువిదుము!

అభిలషింపుమెపుడు సత్యస్వతంత్రమైన
యుత్తమమయినట్టి యూహలంది!
మాటలాడ నేర్చి మరియాద గురిపించి
కీర్తి శిఖరములకు జేరుమన్న!

మంచివాడవయిన మాధుర్యమొప్పగా
నింట బయట జనులు నింపుమీర!
మనసునిచ్చి నీదు మనసు గైకొందురు
నాత్మబంధువనుచు నలరిబోగడి!

మంచి గ్రంథమొకటి మహనీయనేస్తమై
దారిజూపు నిత్యధర్మమేదో!
అంతరంగ మందు నలరి దీపికవోలె
ప్రజ్వలించి నడుపు ప్రగతి పథము!

దుష్టమౌ రచనలు దురితమౌ బుద్ధుల
నంతరంగమందు నలర జేసి!
పాపమార్గములను 'పద'మని నడిపించు
చెదలపుట్ట దరికి జేరబోకు!

హత్యలాగడములు నతిప పరాభవ
కుత్సితంబులైన కుటిలమైన!
దనుజ వర్తనములు ధర్మంబుగా జెప్పు
దుష్టకథల కెపుడు దూరముండు!

మధుర జీవితముల మహనీయ వ్యక్తుల
కంఠమెత్తిజదువు గథల నన్ని!
హృదయమందు జదివి యుత్తేజమును బొంది
వారి యడుగు జాడ పరుససాగు!

వింతలెన్ని గన్న విజ్ఞాన పథమున
మనిషి నన్నమాట మఱువ వలదు!
సంఘమందున గల సామాన్యమానవ
సంఘసేవజేసి సత్కృతిగను

అక్షరముల జ్యోతి యంతటు వెలిగించు
నవ్యజీవితమున నాందిగాక!
సంఘసభ్యులంత జదివిన యీభూమి
కాంతిరేఖలలరి శాంతినిండు!

ప్రగతి నంద మనము పదివేల పనులేల?
ఒక్కపనిని జేయు నొందుప్రగతి!
అందఱి కొడగూడ యక్షరజ్ఞానము
స్వర్గభూమి యగును సరసరీతి!

విద్యవలన నరుకు వినయ వివేకము
మానవత్వము మఱి మమతనొందు!
అక్షరమున వాని కందము చందము
హృదయసీమ జేరి కదముద్రొక్కు!

మాతృభాషయందు మఱిశ్రద్ధ జూపిన
వేయిభాషలందు విజ్ఞుడగును!
మాతృభాషలేక మఱి యేమిరాదూరా!
యధిక శ్రమయెగాని యంటదేమి!

మల్లెదీవెలిచ్చు మధురసుగంధముతో
మధుర ఫలములిచ్చు మావిగున్న!
మనుజుడేమి యిచ్చు మధురప్రకృతికిని
దోచుకొనుటె యెఱుగు దోసమనక!

భగవంతుడిచ్చిన భద్రమౌజ్ఞానము
విలువదెలిసి జగతి నిలుపుమన్న!
మనిషికిచ్చినట్టి మహిమను గ్రహించి
యనుసరింపుమన్న యతని యాజ్ఞ!

ఇచ్చుకానుకలను మచ్చికగ్రహించి
మంచి జెప్పు శివుని మాటవినక!
అనుసరింపక నరు డవకాశవాదియై
దిరుగుచుండువాడు దీరుదప్పి!

బుద్ధినిచ్చి శివుడు బరుషార్థములనిచ్చి
మాటనిచ్చి గొప్ప మనసునిచ్చి!
అవనియంతకు నరు నధికారిగా జేసి
దారి జూపె ముక్తి దారినంద!

నేను గొప్పవాడ! నేను మా సర్వంబు
అంతనాది యనెడి యహము నొంద!
నాశనమునకు దారి నగుబాటు గలుగును!
అహము జేరనీకు నంతరాత్మ!

సోమరిగను యెపుడు సోలిపోవకు చిన్న!
పనియె దైవ మనుచు భావమందు!
కష్టించి పనిజేసి కర్మవీరుండనగ
పేరుదెచ్చుకొనుము! ధీరుడవుగ!

నీతిమార్గముననునీతిగా వర్తించి
నీతిమనసునందు నిలుపుకొనుము!
నీతి పథము దప్పి నిందబొందకుమన్న
నీతి జీవగఱ్ఱ నిఖిలమునకు!

వాక్కుచేత సురలు వరముల నిత్తురు
వాక్కుచేత వసుధ కీర్తినిందు!
మధురమైన వాక్కు మహిమను దెలియగా
వశము నలువకైన వాణికైన!

అతిశయంబున గూడి యందఱు దూలకు
నేను గొప్ప యనుచు నిగుడబోకు!
పెద్దచిన్నలనెడి బెంపును విడనాడ
క్రిందబడెద వీవు ఘీంకరించి!

అడకువింతలేక యట్టిట్టు దూలకు
వేషభూషణముల పిఱుపు లన్ని!
సాధుజనుల ముందుసాగవు దెలుసుకో!
సిగ్గుబడగ వలయు శిరము వంచి!

అంబరమున జెలగి యఱచిన మేఘము
నపుడె యణగిపోయి నపుడె మాయు!
దుర్జనుండు జేయు దురితంబులును గూడ
కాల పురుషచేత గూలబడును!

జలజల ప్రవహించు సెలయేఱు గూడనూ
క్రమము దప్పదెప్పుడు గలగలమున।
క్రమము దప్పినప్పుడు గలుగు విషాదము
జ్ఞానికైన సుజన ధ్యానికైన।

ఆకు రాలిపోవు సలరి శిశిరమునందు
చిగురువేసి పూయు చైత్రమందు।
శిశిర చైత్రము లిల చెంత చెంతనె కదా!
కాలపురుషు కాలగతిని గనుము!

పూవునందు వ్రాలి పుప్పొడి జిందగా
మధువు గ్రోలుచుండు మధుపమలరి!
ఎదుటివారి మనసు వేదన ఎసరుగా
కఠిన మనసులైన కర్కశులిల!

నిండుగర్భమందు నెలలు తొమ్మిదిమోసి
జన్మ మిచ్చి నట్టి తల్లి ఋణము।
తీర్పగలమె యెట్టి ధీరునకైనను
పుట్టినట్టి తనను పుడమి ఋణము।

చందమామ జూచుచక్కగా నొక్కొక్క
కళను జేర్చుకొనుచు గాంతిజిమ్ము।
జీవన పథమందు నీవును నొక్కొక్క
మెట్టునెక్కవలయు మెలకువగును।

ఎదుట పొగడువాడు ఏనాటికైనను
శత్రువగునుగాని మిత్రుడగున?
మంచిచెడ్డ జూపి మనసు నొప్పింపకను
మేల్మిమలచువాడు మిత్రుడగును।

పొగడువాని దరికి బోవకు బేలవై
జిక్కిపోవుదవల చితికి పోదు।
నిష్ఠురముగ బల్కు నిజనేస్తమును ప్రీతి
యనుసరించువాని నాత్మ నమ్ము।

చక్కదనము జిన్న। చక్కని చుక్కయై
యణగియుండు లోన యాత్మగతము।
వేషభాషగాంచి వేడుక బడబోకు
వియ్యమేల? వాని కయ్యమేల?

కనుల గంతలున్న గానుగ యెద్దుగా
దిరుగబోకు జుట్టి తిమిరమందు!
విశ్వమందు నున్న విమల సంస్కృతులను
గనుల జూడు మాత్మ గలిపికొనుము!

అన్ని వైపులనుండు నలరేటి మంచిని
యందుకొనగ నీకు నదురదేల?
వెనుక ముందులేల? వేగము మంచిని
స్వీకరింపు వాని సేకరించు!

గొప్ప కార్యములను దప్పక జేయగా
నాత్మ నిశ్చయంబు నవరసంబు!
చూచి బెదురు నరుడు సువిశాలమైనట్టి
మిథ్యమెట్లు జేయగలడు జగతి!

**అతివలేని యిల్లు యడవి కాఋడవిరా**
**మాట వినవె మహిని మహితయుక్తి**
**సృష్టి మూలము సతి! సృజనమునకు నాంది**
**తల్లిలేని యిల్లు వల్లకాడు!**

మహిని మన్ననలను మాన మర్యాదలు
ఇంటి గౌరవంబె నిహము పరము!
స్త్రీల వలన గలుగు జెందును గృహపతి
సుఖము, శాంతి, కాంతి, శోభనంబు!

ఇంటి పనులయందు నింపుగా దాసిగా
కార్య కరణమందు కరణమువలె!
ఓర్పునందు బుడమి నొప్పుగా దల్లిగా
సేవజేయు సతికి జెందు యశము!

ఎచట స్త్రీలు బూజలింపుగా గైకొని
భక్తి యాదరములు బడయు చుంద్రు!
యచట సురలు యాడి బాడుచునుందురు
కిన్నెరలను వాటి కీర్తనలను!

తనదు మూర్తిగాక దగ నర్ధభాగంబు
పతి శరీరమందు సతికి గలదు!
మూడు వంతుల బరువు మోసెడి స్త్రీనౌర!
తక్కువగను జూడ ధర్మమగునె?

స్త్రీల గౌరవింప చిరుత ప్రాయమునుండి
నేర్చుకొనుము జిన్ని నేర్పుగాను!
చెల్లిగాను సతిని తల్లిగా భక్తితో
మనసునందు దలచి మమత నింపు!

దుఃఖితులను గాంచి దూరముగా బోయి
వట్టి మాటలాడి వదరబోకు!
కంటినీరు దుడిచి కరుణతో మాటాడి
మనసు సేదదీర్చు మాట బలుకు!

దుఃఖమునను బొరలి దురపిల్లువానికి
మాటకాదు మంచి పాటకాదు!
హృదయ వేదనమును విని యూరడించేటి
సానుభూతి వలయు సరసరీతి!

దుఃఖితునకు జన్నులు దూరముగా నుండి
మాటలాడుచుండ్రు మధురముగను!
మాటగాదు; వారి మది బెంగపోవగా
కార్యమేదొ జేసి గావవలయు

కంటనీరు దుడిచి కలవరమును మాపి
మనసుబొందు దైన్య మణచివేసి
సహచరునికి దగ్గ సాయమిచ్చెడి వాడు
పరమ మిత్రుడనెడి పలుకు నిజము!

కష్ట సుఖములు నిల కావడి కుండలు
వచ్చి పోవుచుండు వరుస నవియె
మిత్రు నొదలరాదు; ఛత్రము రీతిగా
కలిమి లేములందు గలసి యుండు!

ఆపదలను నున్న యంగన శీలము
రక్ష సేయుకొఱకు దీక్షతోని!
ప్రాణమిచ్చియైన బడతిని గాపాడు
నంతకంటె పుణ్య మవని లేదు!

తీపి మాటలాడి తేనెల గురిపించి
మాయ తెరను వేసి మర్మముగను
వెనుక గోయిదీసి వెనుకకు బడద్రోయ
నీతి దూరులయెడ రోతబడుము!

పెద్ద మనుషులవలె పెనుబట్టు శాల్వల
వేష భూషణముల వెలయుచుంద్రు!
వేషభూషల గాంచి వెఱ్ఱిగా బోకురా!
యంతరంగములను నరయు మోయి!

వేష భేషజములు వెండి బంగారములు
అంద చందము లలరింప బోవు!
వినయమునను బహుళ విన్నాణముగ బల్క
మనిషి కందమగును మదిని దలపు!

సంధ్యకాంతి జూడు! చక్కగా దొలుకాడి
మబ్బుకన్నె సొగసు నుబ్బజేయు!
నీదు మంచినంత నీవారి కందించి
మంచి బెంచవోయి! మంచితయముగ!

బాలసూర్య ప్రభలు బడి జాగృతిని బొంధు
వస్తు జాలమంత వసుధ యంత!
స్వర్ణకాంతు లలరి సరసత జిందగా!
మంచి బెంచవోయి! మంచితయముగ!

చంద్రికాంతి సోకి సరసిలో మధ్యగా
కలువ భామ విరిసి కాంతి జింది
కొలని యందములను గోటిజేసిన యట్లు
మంచి బెంచవోయి! మంచితముగ!

ఎండవాన నిలిచి యెన్నెన్నో కష్టాలు
ననుభవించి మనకు నలరి ప్రేమ!
పూలు, ఫలములిచ్చు బుణ్యంపు దరువులా
మంచి పెంచవోయి! మంచితయముగ!

చిన్ని గాలివీచి చిన్నారి దీవెల
కదలజేసి హాయి గలుగజేసి!
మధుర పరిమళముల మనసును బులకించు
పిల్లగాలివోలె ప్రీతినింపు!

పసిడి వెన్నుతోని బడిలేచు వరిచేను
భాగ్యరాశివోలె బరమప్రీతి!
అందుకొనుడటంచు నందించు సస్యము
నటులె నీవు జగతి నలరుమన్న!

చంద్రకాంతిజారి జగతిని బడుచుండ
యవని యంబరములు నగును ప్రీతి!
నీవుగూడ నీదు నిర్మలమౌ ప్రేమ
వసుమతిపై రాల్చు వన్నెలొలుక!

మెఱుపు మెఱసి పిదప మేఘము గర్జించి
కుంభవృష్టి గురియు గూర్మితోని!
పుడమి తాప మడచి బుట్టించు ముదమును
నటులె దొలకవోయి! యమృత రసము!

కిన్నెర ధ్వనినుండి కీర్తన వెలువడు
లలిత లలిత ధ్వనుల లాలిత్యముగ!
భావగీతి బాడి ప్రజలను మేల్కొల్పు
విశ్వజనులు నిన్ను వినుతిసేయ!

సాధు సంఘములిల సర్వస్వమును దమ
ధరణి జనుల కిత్తు రవిరళముగ!
మధుర చైత్రఋతువు మర్మమింతయు లేక
తనదు సర్వమంత జగతి కిడదె?

ఈశ్వరుండు నిచ్చు నీ తను ప్రాణముల్
పరుల సేవకొఱకు బాటుబడగ!
మనసునందు నిలిపి మాధవునాజ్ఞల
ప్రజల సేవజేసి ప్రగతి గనుము!

సుజన సంఘమిచ్చు సురుచిర వచనముల్
మనసునందు నిలిపి మనన సలుపు!
చక్కనైన బోధ సన్మార్గవర్తన
యందుకొనుము వారి యాత్మనుండి!

నరుని సేవ యిలను నారాయణుని సేవ
యార్యులన్నమాట యరసి వినుము!
మట్టికాదు కాదు! మనుషులని యన్నాడు
నమర కవి సువాక్కు నరసి వినుము!

సుజనులు నిల తమదు నిజభాగ్యమంతయు
లేని ప్రజలకిచ్చి లేమిగొంద్రు!
గోవు పినదుపాలు గోపాలురకునిచ్చి
పేదపడుట గనవె ప్రీతితోని!

రాళ్ళదెబ్బలు దిని రవ్వంతరోసము
నందకుండ నిచ్చు చందముగను!
మావిగున్న తనదు మధురమౌ ఫలముల
నంది యిచ్చు ప్రేమ జింది నగవు!

అడుగకుండనిచ్చు నతి దూరదేశపు
నదులు నీటినిచ్చు నాట్యలీల!
పంట పొలము దడిపి బంగారు పంటల
దాన మిచ్చు సహజ ధర్మగుణము!

ఉన్న లేకయున్న యుర్విజనులకిచ్చి
తమకునున్నదంత ధారబోసి!
రిక్త హస్తములను నుత్తములుందురు
సజ్జనాళి చిత్త సరళి యటుల।

చిన్నిపూలు తమదు చిన్నారి నగవుల
యందమంత యిచ్చి యతివసొగసు
చింతజేయుగాద। చిద్విలాసములతో
సజ్జనాళి చిత్తసార మిదియె।

నేను గొప్పయనుచు నింగికి యెగురకు
క్రిందబడెద వీవు గినుకతోని।
అహము బనికిరాదు హరిహరాదుకైన
జేటుదెచ్చు నీకు గీటు వడును।

గొప్ప జెప్పికొనుట కోరిక మానుము
ముప్పదెచ్చు ఏటిదెప్ప మునుగు।
ఎదుటివారు నవ్వి యెగతాళి జేతురు
ఎలమి గర్వబడుట ముదముగాదు।

కందిరీగ వలెను గరగరలాడకు
వాగబోకు। యేటి వరదలాగు।
అదనుజూచి నిన్ను యణచి వేయుదురన్న!
అతిగ మాటలాడ మతిజలించు।

తనదుగొప్ప తాను దగ జెప్పికొనరాదు;
ఎదుటివారు బొగడ యేనుగంత।
ఎత్తుబెరిగి బెరిగి చిత్తయి పోరాదు
గొప్ప జెప్పికొనుట గొప్ప తప్పు।

తనదు, బలిమి, కలిమి, తన ధీరగుణములు.
వనదు ధర్మగుణము, దాన గుణము।
తనదు నోట బల్కు దగ దెవ్వరికిగాని
మనసునొచ్చు సముల మానసమున।

పరులు సేయు పనులు నోర్వజాలని వేవో
యవియె సేయరాదు। నరసి నీవు।
సకల శాస్త్రములను సారంబునిది సుమా
శాస్త్ర దృష్టి గనుచు సాగుమన్న!

పరుల కల్మిగాంచి పట్టజాలని బుద్ధి
విడువుమన్న। దాని తడుమకన్న।
పరుల సొమ్మదేల పాపిష్టి మూటరా।
యున్నదానితోని నొందు దృప్తి।

పరుల కష్టబెట్టి బడయకు లాభంబు
బరుల కంట నీరు బరుగులెత్త।
శాతనైన కొంత సేయుము సాయంబు
మనసు నొవ్వదీర్చి మమతజూపు!

సకలజనుల నీవు సాధు సజ్జనులుగా
మనసునందు దలచి మర్మముగను
వందనమును జేసి చిందగా వినయంబు
నహము విడువవోయి। యాత్మయందు।

నిందసేయబోకు నిర్దయ బరులపై
కందసేయబోకు గలచి మనసు।
నిర్మలమగు బుద్ధి నీకు నీవుండుమా।
మర్మమేదొ దెలియు మాధవునకు।

పరుల దప్పు లెన్ని బాపంబు సేయకు
నీదు తప్పులెన్ను నిర్మలముగను!
తప్పుజేయకుండ దగ జీవితము నీడ్చి
యొరులుసేయు దప్పులోర్వవలయు!

చదువురానివారు, సంస్కృతి నెఱుగని
మూఢజనులు గలరు మొరటులిందు!
అందజేసి వారి కక్షర జ్ఞానంబు
పాటనేర్పు ప్రగతి బ్రతుకు జూపు!

అంతులేని లేమి యావరించెను వారి
చుట్టు ముట్టివారి జూడుమన్న!
బక్కజిక్కినట్టి బరువైన బ్రదుకును
ప్రగతి గీతి నేర్పి బాటజూపు!

త్రాగుడు వ్యసనమును దగదంచు దెలుపగా
వెనుకముందు లేల? కినుక యేల?
త్రాగుడు వల యిల తగ నరు నంతస్థు
తరిగిపోయె జగతి విఱిగిపోయె!

త్రాగుడిల నశింప దగ సమాజమునందు
పచ్చదనము నిండు బ్రగతినిండు!
చీకటి తెరలన్ని జినిగిపోవును భువి!
చంద్రకాంతు లలము సాంద్రముగను!

జూదమాడబోకు! దురితంబు బాపంబు
అన్ని బోవు దుదకు నాత్మగౌర
వంబు గుదువ బెట్టి వరుస నాడుచు నుంద్రు
భార్యనైన బెట్టి పందెమందు!

ధర్మరాజు దనదు దారను సైతము
పందెమొడ్డి ధరను భంగబడియె!
సప్త వ్యసనములను సరిరావు దీనికి
సకల సంపదలును వికలమగును!

ఉన్నదంతయు బోయి యులిపికట్టెగ మారి
యడవులందు దిరిగి యలమటించె!
పరుల దాసుడగుచు బరితపింపగ వలసె
ధర్మరాజు వంటి ధార్మికుండు!

కాన జూజమాడ కలలోన సైతము
దలప బోకు! మనసు నిలుపబోకు!
నలుడు సైతమాడి నగుబాటులను బొంది
యాలు బిడ్డల విడి యలమటించె!

కొండెములను జెప్పి కూర్మి స్నేహితులను
శత్రువులుగ మార్చు కుత్సితుండు!
కుటిలనీతి జేత గుణవంతులను గూడ
వేఱుజేయు మతని దూరముండు!

చెడ్డమాటలెపుడు చెనటివై వినబోకు
సరయవలయువాని యర్థములను!
నిజము దఱచి జూచి నీతిగా బరికింపు
వెన్నదీసినటుల జెన్నుగాను!

దొంగతనమనియెడి దొసగును జేయకు
బట్టుబడెద వీవు దుట్టుదుదకు!
ప్రాణహాని గలుగు బతితుడ వగుదువు!
మంచిబోవు మాన భంగమగును!

చుక్కవోలె జనుల దూరము నుండకు!
కష్ట సుఖములందు గలిసి యుండు!
మనుషులందు నుండు మాధవ దేవుడు
సేవ జేసి వారి దీవనందు!

అంటరానితనము నది మహాపాపము
గనగరాదు జెవుల వినగరాదు!
పాపమెచటినుండి బరుగెత్తి వచ్చెనో
మానవునకు దెచ్చె మచ్చయిలను!

సాటి మానవులను సరిగారు బొమ్మనీ
యంటరాని వారలనుచు బలుక!
మనిషి గౌరవమును మరియాద యెటునుండు?
ఆత్మగౌరవంబు నలరి యుండు?

కుక్క, పిల్లి కూన, కుందేలు, కోడినీ
మనిషి యంటుకొనును మర్మముగను!
తోటి మనిషినేల దూరముండు మటంచు
కసరుకొనుచు నుండు ఖర్మమేమొ?

చెరగనట్టి ముద్ర చేతును దగదెచ్చు!
తలను వంచుకొనగ ధాత్రియందు!
మాసిపోని మచ్చ మనలను వెంటాడు
సారహీనమగును సంఘశక్తి!

కులములన్నియు మనము గూర్చుకొన్నవిగదా
వృత్తులందు బుట్టి వృద్ధి యయ్యె!
మనిషి మాధవుడని మనిషి దూరమునుంప
తగదు! బాపబుద్ధి తగదు! దగదు!

సంఘ న్యాయములను సమకూర్పవలె జిన్ని!
సమత మమత వలయు సంఘమందు!
కలువ తామరలుగ బులకించి విరియాలి!
సమ సమాజమందు సకలజనులు!

నోట జెప్పుమాట బాట జూపింపరా
లోకమంత మెచ్చు బ్రాకు కీర్తి!
ధర్మ మాచరించు దగలోకమన జెప్ప
వలెనుగాని వట్టి మాటలేల?

తాను జేయకుండ దగలోకులకు జెప్పి
మోసగించివాడు మోసకారి!
బయటబడును వాని పన్నాగ మంతయు
విదియనాడు లేక తదియనాడు!

బ్రతుకు నర్థంబులను, బాగుగా దెలిసికో!
యాత్మశుద్ధి గలిగి యలరుమెపుడు!
పరుల మేలుకోలుపు! పాపుల క్షమియింపు!
సర్వభూతములను దయను జూడు!

చావు దప్పదు సుమా! సకల జీవులకును
రాజ్యమేలుచున్న రాజుకైన!
పంచ భూతములిల వంచించు సర్వము
నణువునుండి సృజన మఖిల మంత!

పుట్టి గిట్టుమాయ బొలుపుల గనుచుండి
తాను శాశ్వతమని దలచు చుండు!
నీటి బుడగ యనుచు నిలిచి భావింపడు
పక్షి యెగిరిపోవు పథము గనడు!

సుఖము దుఃఖములును జోద్యమౌ మిత్రులు
వెంటనుండు నరుని జంట విడవు!
ఆలుబిడ్డలొదిలి యందఱు బోయినా
జంటకవులవోలె వెంటనుండు!

సుఖము రమ్మనుచును సౌందర్యమును జూపు
మనసు నూయలూగ మధువులొలుకు!
కోటియందములను కోటి యాశలురేపి
కొలను లోన ద్రోయు గలలుజెదర!

దుఃఖ వేదనములు దురపిల్లజేయుచు
కంటియందుజేరి కలగుజలము!
మనసునందుజేరి మదినిపూతముజేయు
బాటవేయు భావి ఫలితములకు!

సత్పురుషుని యందు సర్వప్రకాశక
శక్తియుండు మమత రక్తి యుండు!
అఖిలజన సమూహమలరించు నొకదివ్య
స్ఫూర్తియుండు భవ్యదీప్తి యుండు!

బ్రతికి నన్నినాళ్ళు బంగారుబాటను
బ్రతుకవలయు మదిని జిదుకవలయు!
అంతరాత్మ గలిగి యల సుఖదుఃఖము
పొంతనిలుము! నింత చింతలేక!

దైవమిచ్చినట్టి దారిన నడుచుచు
ఉన్నదాని దృష్టి నందవలయు!
కాని దాని కొఱకు లేమిని జూపుచు
వీధి వీధి నరుల వేడరాదు!

పురుషయత్నమునను స్ఫూర్తిని జూపుము!
కార్యసాధనమును గలిగి విడకు!
మనిషి యత్నముగద! మాధవు దీవన
మంచిపనుల నుండు మహితరక్తి!

ప్రమిదలోని కాంతి ప్రజ్వలించుటకుగా
గూటియందు నిలుప కూర్మి వెలుగు!
గాలియందు నిలుప కాంతులు నిలుచునా?
పురుషయత్నములను స్ఫూర్తినిచ్చు!

ఆకలి యది పోయి యారోగ్యమేలేని
మనిషికేల ధనము మన్ననలును?
పట్టెడన్నము దిన భాగ్యంబులేనట్టి
యట్టి నరునికేల యాఱు రుచులు?

స్వేదబిందువులను జిందును సంపదల్
శీలమగును జాతి జీవగఱ్ఱ!
స్వేద శీలములిల జెఱిగిన దేశముల్
వెనుకబడును వాని వన్నెజెడును?

శ్రమయె దేశమునకు చక్కని మగసిరి
నూత్నయౌవనంబు నురుగు పాలు!
కార్యదీక్ష ప్రజలు గలిగిన దేశంబు
స్వర్గమనగ వచ్చు స్వర్ణసీమ!

అడిగి దెలిసి కొనుము నాశ్చర్యముల నన్ని
ప్రశ్నమీద మఱల ప్రశ్న వేసి
తల్లి దండ్రుల మఱి దగ యుపాధ్యాయుల
ప్రశ్నయందు గలదు ఫలితమంత!

మంచి పుస్తకమును మంచి యాలోచన
మంచి సూక్తినెపుడు మఱువ వలదు!
చదువు మంచినంత చక్కగ జతజేసి
యాచరింప వలయు యాకళించి!

చదివిన విషయంబు చక్కగా నర్థమై
మనసునందు నిలిచి మసగవలయు!
బ్రతుకున పెనవేసి భావిజీవితమున
బాటవేయు పూలతోటలాగు!

ఎన్ని చదువులున్న యెంతవిజ్ఞానము
వన్నెలున్నగాని యొసర వినయ!
సంపద యది లేక చాలదు భాగ్యము
విజ్ఞులతని మెచ్చ రెందుగాని!

సంపద చదువులును చాలగా లేకున్న
వినయమున్న చాలు విమలమతిని!
అఖిలజనుల ప్రేమ నతిశయంబుగనందు
వినయమున్న సాధి విశ్వజయము!

మొండిపట్టుదలను మొరటుని వలె నీవు
ధిక్కరింపవలదు ధీరజనుల!
పట్టువిడుపులుండి పగవారిసైతము
అనుసరింప వలయు నాదరమున!

తోటిమానవులను దోటి సోదరులుగా
మనసునందు దలచి మర్మముగను
గౌరవమును జింది కలిసిమాటాడుట
మానవత్వమండ్రు మర్మవిదులు!

ఒరుల యావరమును నొసరపొందవగ దలప
ముందు జేయవలయు ముదితముగను!
గౌరవాదరములు గలుగజేసినయెడ
పొందగలవు! స్నేహ మందగలవు!

నాల్కయందు గలరు నలువరాణియు లక్ష్మి
ప్రబలశక్తిగలుగు పార్వతియును!
నాల్కతో మాటాడు నలువురు మెచ్చగా
శుభము బలుకునెపుడు సుందరముగ!

విద్యలేనివాని వినయ మెచ్చటనుండు
వినయమదియు లేక విత్తమెచట?
విత్తమింతలేక యిహపర సుఖ మెచట?
గాన చదువు నేర్వ కదిలిరమ్మ!

దేహశ్రమను జేసి దినదినంబును నీవు
అందమైనదేహ సుందరములు!
గలిగి దీర్ఘకాల బలసంపదలు గలిగి
మంచిసేయవయ్య! మానవులకు!

జ్ఞానమునకు హద్దు జగతిలో లేదురా!
ఆదిమొదలులేని యాదిశక్తి!
జ్ఞానమనగ శుద్ధ జగదీశ్వరుండురా!
విశ్వరూప మద్ది వేయునేల?

మనిషి జీవితమొక మల్లియకుసుమము
ప్రేమసౌరభంబు ప్రీతి వినర!
మల్లియవలె నీవు మధురిమవెదజల్లి
మనిషి జీవితమున మార్పుదెమ్ము!

జీవకోటికిచ్చి జీవకోటిని బొందు
మధురమైన ప్రేమ మఱువగలమె?
మనిషిమనసు మెచ్చి మాధవుండిచ్చిన
వరప్రసాదమనగ వలదె దాని?

మనిషి మనిషి మధ్య మధురాతి మధురమౌ
ప్రీతి వెలయవలయు గీతిగాగ।
దేశదేశములకు జాతిజాతికి మధ్య
ముడులు బడగ వలయు మోదమలర।

విశ్వమానవులిల విదితంబు నొక్కటి
ఖండ ఖండములను గలిగియున్న!
మతము జాతులిలను మఱియెన్ని యున్నను
నరుని తత్త్వమొకటి యరసి చూడు!

అలసిపోయినట్టి యల్లాడుచున్నట్టి
విశ్వమానవ చిర వేదనలను!
కంటి నీరు తుడిచి కన్నీరు దొలగించి
అన్న దమ్ములనుచు యాదరింపు!

తిండి బట్టలేని దిరుగాడు జనులకు
గూడులేని చిన్ని బీడులేని!
బానిసలుగ బ్రదుకు, బండచాకిరి జేయు
దీన జనులగాంచు దివ్య కరుణ!

రోగ రోష్టు కుములు మూగజీవులను వే
కనికరింపుమయ్య కరుణ గలిగి!
మందు మాకునిచ్చి మమతల గురిపించి
ఆర్తిబాపు! నీదు కీర్తి వెలయు!

మనిషి నాపరింపు మధురమౌ హృదయము
ప్రేమ పొరలవలయు ప్రీతి యలల!
మనసులోని ప్రేమ మాధవు పెన్నిధి
ప్రేమకన్న లేదు వేఱు జగతి!

ప్రేమ త్యాగమగును, ప్రీతిని గురిపించు
మనిషి మాధవునిగ మారిపోవు!
భక్తి, రక్తి, శక్తి, ముక్తిని గలిగించు
నిహము బరమునిచ్చి నింపుగూర్చు!

ప్రేమలేనిదేది? ప్రీతి వర్షింపని
ప్రాణికోటిలోని ప్రాణియేది?
వసుధయందు గలుగు నిసుమంత ప్రాణియు
బాడుచున్నదయ్య! ప్రణయగీతి!

ప్రేమ కామమనగ లేమయ్య! కాదయ్య!
కరుణతోని నున్న కావ్యమయ్య!
అర్పణంబుసేయ మఖిలంబు ప్రేమకై
జీవులనుచు దేవదేవునందు!

ప్రియమైన సత్యమును ప్రీతితో మాటాడు
బిడియ మేలసయ్య జడియనేల?
అందఱి యెదయందు యానందమును రేపు
మధుర వచనములను మఱలబలుకు!

ప్రేమచేత బొందు పెద్దల దీవన
మాటచేత బొందు మన్ననలను!
భక్తిచేత బొందు భగవంతు దీవన
నాత్మచేత బొందు నఖిల జగతి!

మంచి మిత్రులందు మధుర స్నేహము విరిసి
మధురమైన పూల మాలయగును
చెడ్డ మిత్రులందు చెడిపోవు స్నేహము
గాఢ జీకటులను గలిసిపోవు!

బాగ వినగదోయి! బ్రతుకున కర్థంబు
పరుల మేలు జేయ పాటుపడుము!
పరులకు హితమును బల్లెత్తు జేయని
మనిషి బ్రతుకు మరణమంద్రు విదులు!

స్నేహమునకు నవ్వు జిఱునవ్వు సొగసులు
నిండుకుండ లటుల నిర్మలములు!
రెండు హృదయములను రేకులు వికసింప
పూల విరియజేయు బులకరింప!

పడిన గుడిని శిలల బన్నుగ సరిజేసి
కట్టనేల శ్రమను మెట్టనేల?
మనిషి బ్రతుకునందు మాధుర్యమును నింపి
నిలుపవోయి శివుని నిర్మలముగ!

అన్నె పున్నెములను నాశల యెఱుగని
జంతుకోటినంత జేరదీసి –
అంతమొందజేయ నదియెంత పాపము!
నాపుజేయవోయి నాత్మదలచి!

ఆటపాటతోని యంపతితో గలిసి
ప్రేమతోని మెలగు ప్రియము మీర!
పెద్దల బ్రేమతో బ్రీతితో జిన్నల
జూడ నేర్చుకొనుము! సుందరముగ!

కష్టములను జడిసి యిష్టార్థమును నంద
వెనుక కడుగువేసి వణక వలదు!
కష్టపడినగాని కలుగదు ఫలితము
ముందు కురుకవోయి మోరనెత్తి!

పట్టుదలను సకల కష్టాల నెదిరించు
గమ్యమునకు జేర కదులుమయ్య!
వెనుకబడిన నీవు వెనుకనే యుండెదు
ముందు జూపు వలయు నందు ఫలము!

నిన్ను గదలజేయు నీతివంతుల నెపుడు
ముందు నుంచుకొనుము మోదమలర!
అపుడె నీవు కదిలి యాదర్శముల నంది
కోర్కె దీర్చుకొనెదు కీర్తి మిగుల!

ఎట్టి పనియునైన నిష్ఠ జేయకు చిన్న!
ముందు వెనుక జూచి మోదమలర!
పట్టి విడుపుతోని పనిని సాధించాలి!
నేర్పు వలయు చతుర కార్యదీక్ష!

వంకలెన్నొ పెట్టి వన్నెల దిగజార్చి
నింద జేయువారు నెందరోను!
నీవు జేయు పనులు నిండు సత్యంబైన
చింతయేల? మదిని వంతయేల?

నింద సేయుచుండ్రు నీతిని విడనాడి
కార్యదీక్ష పరుని కఱకు జనులు!
ఏనుగువలె నతడు నేక దీక్షను బోవు
కసరుకొనడు మదిని విసుగుకొనడు!

ఫలమునిచ్చు దరువు బడురాతి దెబ్బలు
అయిన మధుర ఫలము లవని కిచ్చు!
మంచి జేయువాని మది విమర్శలు జేసి
చిన్నబుచ్చుచుంద్రు జెతుగు లెపుడు!

దీన మానవునకు దిక్కు నీవై యుండి
సేవజేయ వలయు భావమలర!
సర్వ ధర్మములను సారంబు నిది సుమా!
మరువ బోకుమయ్య మానసమున!

సొంత లాభ మొదిలి సుంతయు బరులకు
మేలు జేయుమయ్య మేలుదనర!
దర్మ మెచటబోదు జిమ్మను నీవయి
అమృత రూపమగుచు నమర మగుచు!

కోటి జ్యోతులసరి గోవిందు గుడివోలె
మనసు నుంచుకొనుము మధురముగను!
సకల జీవకోటి సంతోషమున జేసి
ప్రేమభావ మొలికి ప్రీతిదొలుకు!

పచ్చని వరిచేను పరవశమై దాను
పిల్లగాలి వగిలి ప్రీతితోని!
నాట్యమాడురీతి నవ్వు మొగంబున
బలుకమయ్య జనుల బ్రాణప్రీతి!

ఇంద్రధనుసువోలె యేడు రంగులతోని
యందమొలుకు ప్రజకు విందుసేయు!
మొగము ముడుచుకొనకు! మోమటు ద్రిప్పకు
పెదవులందు గలదు ప్రేమ ప్రీతి!

చెడును జేయబోకు జెడును సర్వస్వము
దినమునకొక మంచి దీక్ష సేయి।
అదియె దేశభక్తి। యదియె మాధవసేవ।
మంచి జేయబూను మదిని సతము।

కాలము కల వలెను గదిలిపోవును జిన్ని।
యాగబోదు। బలిమి దాగబోదు।
కాల వైచిత్రముల గ్రహియింపరా చిన్ని।
మరుల దిరిగిరాదు। మాట వినుము।

జ్ఞాన సంపదగద! జగతికి జాతికి
యున్నతమగు దారి యుర్విదలప!
అంతకంటెను విను। మారోగ్య మవసర
మఖిల సాధనముల నందదలప।

ఆత్మనిశ్చయంబు నవసర మన్నింట
గొప్ప పనులు జేయ కూర్మిదలప।
తనను నమ్ముకున్న దగ నెట్లు సాధించు
నున్నతంబులైన కన్న కలలు!

యత్న మవసరంబు రత్నంబు సాధింప
కృషియె మూలమిలను గొంకులేదు!
ఇత్తు నాటనపుడు జెట్టెట్లు బుట్టును?
తరువు లేనిదెట్లు దనరు నీడ?

త్యాగనిరతి వలన దగనంత నొందెదు
విశ్వజనుల ప్రీతి విమల వినతి।
సాధు సజ్జనులను సరసత మదియందు
మాలవేయుచుంద్రు మనసు పూల!

రాజకీయములను రగడల జేరకు
సంఘసేవ జేయు సరససరీతి।
సురభి పాలనిచ్చు సొబగున జేయుము!
జలద మాల యిచ్చు జలము పోల్కి।

సంఘసేవ జేయ సరసత బయనించు
వాడ వాడలకును వసుధయందు।
పేద సాదలందు బేరిమి జూపించి
కంటనీరు దుడిచి కలత మాన్పు।

దుఃఖితులను గాంచి దూరంబునుండకు
వెంటనుండు వారి జంటగాను।
వేదన దొలగింప విలపించు జనులను
కంటినీరు దుడిచి కలత మాన్పు।

దిక్కులేనివారి దెస బ్రీతి జూడుము!
అక్కునందు జేర్చి యాదుకొనుము।
పట్టెడన్నము పెట్టి పరగ యాకలిదీర్చి
సేదదీర్పుమయ్య పేద జనుల।

సంఘసేవ యనిన సరుగున బరువెత్తు
సేవయందు గలరు శివుడు హరియు!
అహము దొలగిపోవు అందము నైనట్టి
జ్యోతి వెలుగు కనుల బ్రీతి దొలుకు!

గుడులు, గోపురములు, గుహలును గోడలు
రాతి స్తంభములును రమ్యముగను।
శిలలు, శిల్పములను చిత్రమౌ రాళ్ళను
పాడవలయు నీదు ప్రగతిగీతి।

నవరసములతోని నాట్యాలు సలిపేటి
భరత నాట్యరీతి భావమెఱిగి!
కూచిపూడివారి కూర్మి పద్ధతులను
నర్తనలను నేర్చి నవ్యరీతి!

హావ భావములను నందాలు దొలుకాడ
నాట్యవేదము లలి నవ్యరీతి!
దివ్య కళను నీవు దిశలు వ్యాపింపగా
మనుజులందు జిందు మధురిమలను!

ఉలిని సుత్తిని గొని యున్నత శిఖరాల
రాతిబండలందు రమ్యముగను
శిలలు జెక్కినట్టి శిల్పుల మదినిల్పి
కళలు సృజముసేయ కదిలి రమ్ము!

మనసు నిలిపి జెక్కు మధురమౌ శిల్పాలు
మనుజ హృదయము లలి మైన మెటుల!
మారిపోవ జగము మనసులు నలలుగా
పొంగులెత్తిపోవ పొలుపు గులుక!

పాటపాడి డొళ్ళు బరవశ మవ్వాలి
జీవకళను దొలికి తేజమలర!
గుహల స్తంభాలను గూర్చిన శిలలన్ని
పాట పాడవలయు బ్రజలతోని!

సేవకంకితముగ జీవమంకితమిచ్చు
భవ్య జీవునకిల భావజగతి!
హద్దులు గనరావు నాశలు తేవుగా
వసుధ జనుల మదిని నొకటి దలపు!

ఒక్క మంచి పనిని యొనర సాధింపగ
దలచితేని మనసు నిలిపి లేని!
త్యాగధనమునంత దగ సద్వ్యయము సేయ
ఫలము జేతికందు చలములేని!

పెరుగునుండి వెన్న బేర్మి పొందగ దలప
చిలుక వలయు చల్ల గలకవలయు
కృషిని గలుగుచుండు గేకసల్ గొట్టుచు
పూర్తి కార్యము లవి గూడు నరుని!

కష్టములగు నవియు గలుగజేయును నరు
రాటుదేల దీర్చు రంగుమీర!
నీటిలోని రాయి నిండు ప్రవాహము
దొరలి దొరలి నునుపు వరలు గాదె!

దూర తీరములను చరచి పోవలెనన్న
వంపులెన్నొ దిరిగి వన్నెదరిగి!
మిట్ట పల్లములను జెట్టుల పుట్టల
కష్టముల సహించి గడగ వలయు!

రూప గుణము లిలను రూఢిగా ప్రతిభయు
వినయ గుణముచేత విస్తరిల్లు!
మానవత్వమును మనిషిని దేవత్వ
మావరించి నడుపు మధురముగను!

నీతి నిజములేక, నిర్మలత్వము లేక
మనిషి గాంచలేడు మహినికీర్తి!
చంద్రలేఖ లేని చారు సుందరములు
లేని రాత్రియగును మనిషి బ్రతుకు!

4)

ఆదర్శములు లేని యందా లవెందుకు?
వస్త్ర భూషణములు వస్తుతతియు!
మానవత్వ దీక్ష మహిమలు లేని యా
మనిషి బ్రతుకదేల మహిని బరువు!

సభలయందు వలయు సరస వాక్యసురీతి
అందములను జిందు చందములను!
సర్వజనుల తనదు సరస సంభాషణ
అమృత ధారలందు నలరిదేల!

విధిని నిర్వహించి విద్యుక్త ధర్మము
నెఱప వలయు ప్రీతి జరుప వలయు!
కలిమిలేములందు కష్ట సుఖములందు
మానరాదు విధిని మరువవలదు!

పనిని దైవమంచు భావింపరా చిన్న!
పనిని వదలకెప్పుడు బామరునిగ!
కర్మ జేయకెపుడు గలుగదురా ముక్తి
మంచి పనులుజేయ మరవకెప్పుడు!

మంచిపనులు చేసి మహిలోని ప్రజకెల్ల
యంచితముగ మేలునలర జేసి!
కంటనీరు దుడిచి కలగుండు నణగించి
కలత బాధదీర కనికరింపు!

మంచి కంకితమయి మహిలోని ప్రజకెల్ల
మనసునందు నిలుము మన్ననలను!
అడుగుజాడలందు నలరగా జనులెల్ల
వెనుక నడచిరాగ వేల ప్రజలు!

పాలునీరు గలిసి బరగిన యట్లుగా
ప్రజల గలిసియుండు బ్రగతిమీర!
చివఱి గడియవఱకు జింతించు బ్రజలకై
మనిషి మాధవుడని మదిదలంచి!

తొందరింత లేక దొట్రుపాటును లేక
మర్మమింత లేక కర్మలందు!
మాధవార్పణమని మనసున దలచుచు
కార్యసరణి జేయి కర్మలన్ని!

త్యాగశీలివగుము! జగతిని కష్టాలు
బాప దీక్షనంది బరువు దీర్ప!
దారి వెదకుమయ్య! దర్శించి కష్టాలు!
పరుల మేలుకొఱకు బాటుబడుము!

చేయిజాపి యొరుల చెంతను జేరకు
కలిమి గలుగువారి కడకు జనకు!
బంది వగుదు వారి బానిస వగుదువు
మనసునున్న మంచి మాసిపోవు!

ఒఱను వంచకెపుడు దగ నెవరయినను
మనను మంచితనము మాపకెపుడు!
అడుగు జారబోకు! నడుసులో గాలిడి
పాప పంకిలమున బడగబోకు!

చెడ్డ దారులందు జెడి సంచరింపకు!
సప్త వ్యసనములను సరసబోకు!
మానవత్వమున్న మనిషిని నేనని
మఱచి బోకుమయ్య! మాటనెపుడు

తీపి మాటలు విని దీరుగా నిజమని
మనసునిచ్చి దరిని మసలబోకు!
మేకవన్నె గలుగు మెకములు ధరణిని
అందునందు దిరుగు జందమెరుగు!

సంపదలను నిండి సర్వస్వమున్నను
అన్నదమ్ములందు నరయు ప్రేమ!
సన్నజేసి వారి చిన్నబుచ్చకు నెపుడు
మనసు నొవ్వకుండ మసలుమెపుడు!

దీపమున్న యపుడు దీరుగా నన్నియు
జక్కజేయవలయు సరసరీతి!
ముందు వచ్చునట్టి ముడులను గ్రహియించి
తీరుతెన్నులన్ని దీర్చవలెను!

తీపిమాటల నిన్ను దీరుగ వలవేసి
ఓ వలనీక నిన్ను గట్టివేసి!
పట్టివేయుదు రిల బరగ భద్రతతోని
దుష్ట జనులనుండు దూరముగను!

మాట గొప్పజూచి మరియాద నివ్వకు
మనసు బట్టి జూచి మనసు నివ్వు!
మాటలేల వేయి పాటలు పదివేలు
నీతి లేనివాని నీటులేల?

ఒరిన మనసులోని గలిగి వర్తింపకు
నీతి మరువబోకు కోతిగాను!
కారు మాటలాడ గదలక రాయియై
మూగవడును మనసు మొద్దుబారి!

పరుల ముందు నెపుడు పరుల నిందింపకు
కఠిన వాక్యములను గలుషితముగ!
సమయ మెఱిగి వాడు చయ్యన మనమీద
పెద్ద పులికివోలె హద్దు మీరు!

ఇందునందు గలడు నీశ్వరు డనుచును
దెలుపువారె గాని తెల్లముగను!
సర్వజీవులందు సాధుభావంబున
మసలువారు లేరు మహిని జూడ!

గలుగు నాడు స్నేహ కాంక్షను జతగూడి
లేమినాడు విడువ లెస్సగాదు!
వచ్చిపోవువాని వరుస లెక్కింపకు!
మైత్రి శాశ్వంతబు మహిని దలప!

ఒకరికిత్తురు మఱి యొకరి యాచింపరు
త్యాగధనులు ధాత్రి ధర్మబుద్ధి!
చేయిజాపి యడిగి జెందరు శోకము
కష్టకాలమెంత కఠినమైన!

స్నేహమునకు గుర్తు చిక్కని చిఱునవ్వు
మాట మంతిలేక మనసు కదులు!
మాటలాడు కొనును మఱి మఱి నేమియో
తెలియ జెప్పలేరు దేటపఱచి!

వృద్ధ జనుల నెపుడు శ్రద్ధగా జూడుము!
చిత్త మందు ప్రేమ చిందులాడ!
మంచి మాటలాడు మఱి సంతసము నంద
దీవె నందుకొనుము! దేవతలుగ!

మంచి మిత్రులెప్పుడు మమతను విడబోరు!
సరస విరసములను జరగుచున్న!
మంచితనము వారి మణుల దాపుకు దెచ్చి
పూలతావి వోలె బొలుపు గూర్చు!

ప్రతి ఫలంబుగోరి జరగ వాంఛింపకు
హరి సమర్పణమని యాత్మబుద్ధి!
లేనివానికిచ్చు లేశమైనను గూడ
కొండ లగుచు వచ్చి కోర్కెదీర్చు!

పలుకు పాట వినుచు బరవశమందకు
పసను దగులు కొందు వంత జెంది!
చిన్ని చిగురు మనసు జెంది కోకిలపాట
కాత్మ నాశనంబు నందు గాదె?

దేహబలము మిగుల దీప్తిని జెందగ
శ్రమను జేయవయ్య క్రమముగాను!
దేవుడుండు గుడిగ దేహము భావించి
సుందరముల గూర్పు అందముగను!

చిట్టి పొట్టి మొక్క చివురులు పూలతో
ఫలములిచ్చు మ్రానుపగిది బెరుగు
నీవుగూడ బెరుగు నిత్యనూత్న వికాస
మంది దినముదినము నందముగను

మనసు బెద్దజేసి మాధుర్యములు దొలికి
విశ్వ విమల దివ్య వీధులందు!
పక్షివోలె యెగిరి పలు భావములు నేర్చి
మాతృభూమి కొసగు మధురముగను!

కలువ పూవువోలె గడల వర్తింపకు
సరసిజమునువోలె పెంచుకొనుము!
అందములను గూర్చు చందము తెగ బ్రాత
మాతృభూమి మెచ్చ ధాత్రి బొగడ!

చెడ్డ బలుకు లెపుడు జెందించి పరులను
నొవ్వజేయుబోకు జిహ్వ రగులు!
మౌనమూనుమయ్య మఱికొంత సేపున
కాక మిత్రులగుదురయ్య పరులు!

ఇసుక భూములందు పిరియింపగావచ్చు
పూలదోట అలరి స్ఫూర్తి దొలుక!
మనిషి మేధతోని మఱియేది సాటిరా!
కార్యసాధనమున గడగుమోయి!

కలిసి ముందు నడువ కార్యసాధనమోయి
ఐకమత్యమునను నందు జయము!
వేఱుబడిన నీకు నేకాంత వాసము
వట్టిగొడ్డువగుదు వన్నెదఱిగి!

చేయి చేయి కలుపు! జెండాడు జీకటి
వేయిమంది కలియ వెన్నెలగును!
వెంటలేక ప్రజలు నొంటరి తనమున
కార్య సాధనమున గడగలేవు!

ఐకమత్యమునను నాయువు యశములు
నిష్టభోగములను నింపు గూర్చు!
కష్టనష్టములను గడకుద్రోయును వేగ
యిష్టసిద్ధులన్ని యలరి నిచ్చు!

వేఱుబడకుమోయి! విపదల కొనిదెచ్చు
కొనకుమోయి! చిన్ని! కోరికోరి!
సంఘబలముతోని సరిదూగ దేమియు
వెట్టిగాకుమోయి! వేఱుబడుచు!

సకల దేశ ప్రజల సఖ్యము సేయుము!
నిచ్చి పుచ్చుకొనుచు నింపుమీర!
శాంతి కాంతి సమత సరిదూగు జనులను
కలసి పయన మగుము! కాంతి దొలుక!

సకలదేశ ప్రజల సములుగా భావింపు
అన్న దమ్ములనుచు నలరి మదిని!
కష్టసుఖములందు గలిసి చరింపుము!
పూలమాల లోని పూలభంగి!

ఒకరి కష్టసుఖము లొకటని తనవని
యార్ద్ర భావమునను నలరి నీవు!
లోకప్రజల దాపుజీకటి దొలగగా
కాంతిరేఖ విరియ గదులుమయ్య!

యుద్ధము లవి యేల నిద్ధరిత్రిని జూడ
మనిషి యుద్ధమందు మాసిపోవ!
నరుల రక్తమిలను నదులుగా బ్రవహింప
జూడగోరుటెంత చోద్యమగును?

యుద్ధ వీరులనుచు నిద్ధాత్రి చరితను
కఱకు మోటువారి కథలు గట్టి!
పాడుచుండు టెంత పాపమో తెలియదు!
కాలరాయుడవని కథలు మాయ!

పొరుగు దేశములను బొంచి దొంగలవలె
యాక్రమింతురవని యంతులేని!
కష్ట నష్టములను గలిగించి సంపదల్
దోచుకొందు రవని దొంగలవలె!

మారణాయుధములు మఱి మఱి నిర్మించి
మట్టు బెట్టు చుంద్రు మానవులను!
రక్త దాహమునను రాత్రులు బవళులు
క్రూర జంతువులుగ గూడియుంద్రు!

జనుల వేఱుపఱచి జాతులు వేఱని
మనుజులందు ద్వేష భావములను!
దోచుకొందురవని దొంగల దొరలుగ
యుద్ధములను రేపియిద్ధరిత్రి!

మనిషి రక్తమెంత మధురమో వీరికి
కఱకు యుద్ధములను గథల నడిపి!
రక్త సిక్తభూమి రహి నాట్యమాడుచు
ప్రీతి గులుకు చుంద్రు ప్రేతములుగ!

విశ్వజనులు వీరి వివరము గుర్తించి
కల్లబొల్లి కథల గడకు ద్రోసి!
విశ్వశాంతి గీతి విరియగా భువియంత
యన్నదమ్ములనుచు నరసి పిలువు!

క్రొత్త జగతి నిల్పు గోరెడి ప్రజలతో
గలిసి ముందు నడువు కాంతి విరియ!
క్రొత్త జగతి కొఱకు క్రొన్నెత్తురులు నిచ్చి
ఆత్మతృప్తి నందు నమరుడవయి!

శాంతి బల్లవింప చంద్రకాంతులు నిండ
భూమి ప్రజలు పొంద భూరి సుఖము!
అంద చందములును నాశలు బులకింప
తెల్లకలువ వోలె బల్లవింపు!

పేదప్రజల నెపుడు ప్రీతితో దిలకింపు
బాట జూపి వారి బాధ మాన్పి!
దయయు, ధర్మములును దాక్షిణ్యములుగావు!
పేదతనము బాపువిధము జూడు!

నీవు కదులు ముందు నీతిని వర్ధిల్లి
సంఘమందు నీతి సరసమాడ!
కదలజేయు మెపుడు కాంతిని వర్షించి
జాగృతులను జేయు జగతి జనుల!

తల్లిక్రిందు నీవు దపమును జేయకు
దేవు డిందె గలడు దేరిజూడ!
మానవత్వమున్న మనిషియే దేవుడు
మనిషి మనసునింపు మానవతను!

సంతస మను నద్ది సరిలేదు దానికి
తుష్టి పుష్టి నిచ్చి కష్టములను!
కలకలహా సియించి కలవరమొందక
చిన్నినవ్వు నవ్వి జేర బిలుచు!

మదిని సంతసమున మానక యుండుము!
నీసు బడగ బోకు వీసమయిన
అన్నదమ్ములవలె నాత్మీయులకువలె
కౌగిలింపు పరుల కాంక్ష మెఱయ!

సంతసమునసద్ది చల్లని శశిరేఖ
మనసు నుండి లేచి మర్మముగను!
చిరు పెదవులయందు జిత్రమై నిలుచును
సంధ్య లేఖ పోల్కి సరసముగను!

చీకటి దఱిలేని చిక్కని వెన్నెల
తెల్ల కలువ వోలె నుల్ల సిల్లు!
మనసు దేలియాడు మధురమౌ నుయ్యెల
సంతసమున కెనయు సాటిగలదె?

బయట వెదుకబోకు బంగారు శాంతిని
మానసమున వెదుకు మర్మముగను!
అంతరాత్మ యందు నగుపించు కృష్ణుడు
నలరి వెదుకవలదు! నాఱుబయట!

సత్య ధర్మము లిల శాశ్వతం బైయుండు
సమసరింపవలయు నరసి వాని!
మంచి తనము మఱియు మానవత్వము వాని
వెంటనంటి యుండు వేఱుబడక!

ప్రాత యుగములకును ప్రాత భావాలకు
వారసుడవుగాకు! వన్నెలుడుగ!
క్రొత్తయుగమునకును కొత్త భావాలకు
ముందు నుందు ననుచు ముదము బలుకు!

ప్రాతక్రొత్తలెపుడు జతగ బోవుచునుండు
కలిసి యుండు నెపుడు వెలిసిపోవు!
పువ్వుతావి గూడి బులకరించిన యట్లు
విత్తు చెట్టురీతి వేడుకలర!

ప్రాత క్రొత్త యనుచు బరుగెత్తబోకుము
ప్రాతనుండి క్రొత్త బరిఢవిల్లు!
అదియుగూడ మాయ సంతలో నుదయించి
తిరుగ క్రొత్తవచ్చు దీర్ఘ శ్రుతిని!

మారిపోవు జగము మారు సర్వస్వము
అణుపునుండి నిఖిల మంత మారు!
సత్య ధర్మము లిల జారవు, నిలుచును
నిత్య కర్మములను నిలిచి యుండు!

గొప్ప చేయుదునని జెప్పకు లెస్సయు
చిన్ని పనినియైన జేసి జూపు!
వండ మాటలేల వడరని కుదరని
సత్య వచన మొకటి చాలు జగతి!

మానవత్వములేని మనిషి జీవితమేల
సంఘ బలములేని సమ్మెలేల?
శిల్ప కళలు లేని శివుని యాలయమేల?
నీరులేని బావి నిలుపనేల?

మనిషి రూపు జూచి మరియాద నివ్వకు
గుణము జూడువాని కూర్మిజూడు!
అందములో వాని చందము గ్రహియింపు
అపుడు యిమ్ము విలువ యందమునకు!

ఉన్నవాని కిడకు ఉన్ని దుప్పటులను
లేనివానికిమ్ము లేశమైన
పాతగుడ్డ నిచ్చి బరువము గాపాడ
ఈశ్వరుండు మెచ్చు నింపుమీర!

పూర్వకవుల నెపుడు బొరబొర దెగడకు
కఠినపదముల ఝురి కలవరబడి!
నాటికాలరీతి నయముల గుర్తింపు!
పూర్వసాహితిగల పొలుపు సొలుపు!

పరుల బాధపెట్టి బర బరలాడకు
ఆత్మ నిగ్రహంబు నలరియుండు!
సకల జనుల తోని సఖ్యత నుండుము!
నాదరమును గొనుము నఖిల జనుల!

ఆత్మశోధనమున నన్నియు దెలియును
తప్పు లొప్పులన్ని విప్పిజూపు!
అంతరాత్మ బోధనను బరిశుద్ధుడై
మంచిదారి నడుచు మానవుండు!

లేనిదాని కొఱకు లేమిని జూపుచు
దేవిరింపబోకు దిశల దిరిగి!
ఉన్నదానితోని యొప్పుగ దృప్తితో
ననుసరింపవలయు నాత్మదలచి!

చిన్నిపనులనైన జిలిపిగ జేయకు
సుందరముగ జేయి యంద మొలుక!
చిన్ని బొమ్మనైన చిత్రాతి చిత్రము
శిల్పి జేయబోడె శిల్పములను!

గొప్పజేయవోయి కోరిక నెరవేర
మంచి చేయబూను మానవతలకు!
ముందు తరమువారు ముదితులై తనివార
నిన్ను బొగడవలయు నిండు మనసు!

లలితకళల యందు లాలిత్యమొప్పగా
మనసు లగ్నమవగ మమతపెంచి!
సత్యము శుచి శివము సౌందర్యముల నిల
సృష్టినంతజూచు దృష్టినిలిపి!

కవితలెల్లజదువు గద్యపద్యములను
కావ్యనాటకములు కథలునవల!
పూర్వసాహిత్యమును బొందుగాఖతియించి
నవ్యకవితజదువు నాణ్యముగను!

మానవహృదయాలు మాధుర్యమునుజింద
నవ్యజాగృతులిల నాట్యమాడ!
మమత కాంతి శాంతి మానవత్వము దొలుక
కవితపాడదోయి! కమ్మగాను!

చిన్ని కృష్ణునివలె చిన్నారి మురళితో
నూది పాట బాడి మోదమలర!
గొంతు నెత్తిబాడి కోట్లాది జనులను
గదలజేయుమయ్య గానసుధను!

రంగు రంగులైన రమణీయమౌ కుంచె
చేతబట్టి వివిధ చిత్రములను!
మనుజ లోకమందు మాధుర్యములనన్ని
యంద చందములను నలర్వ్రాయి!

అందెల గలగలలు సుందరి పాదాలు
సుందరాభరణము శుచిధరించి!
బొట్టు గాటుకలను బొలుపుగ దిద్దుచు
పద్యమందు గాంచు నతివసొగసు!

శ్రమను జేయు రైతు చైతన్యమును గను
నాగటెద్దు చాలు రమ్యముగను
భూమితల్లి సొగసు బొలుపుల గాంచరా!
కుంచెగాన ప్రతిభ కూర్మిగనుము!

గుహాలయందు నీదు గురువులు వ్రాసిన
దివ్య చిత్రకళలు తేజమరసి!
నీవుకూడ వ్రాయు నిత్యనూతనముగ
యుగయు సంధ్యలట్లు నుర్విబొగడ!

లలితకళలయందు రాగము వర్ధిల్లి
మునిగి పొమ్ము దీక్ష కఱిగి పొమ్ము!
కళలు సరులకనెడి కాంక్షతోడను జిన్ని
చిత్రకళను నేర్చి చెన్నుమీరు!

భక్తి మీర చదువు భగవంతు పదముల
రక్తి మీర బాడు రాష్ట్రగీతి!
శక్తిమీర జేయి సహకార ముర్వికి
మూల పురుషుడిచ్చు ముక్తి పథము!

మాతృభాషయందు మరియాద పీఠకు
తుష్టి పుష్టి నిచ్చి త్రోవ జూపు!
తల్లిపాలగాదె తనయుడు బెంపొంది
బాలసూర్యు వోలె బ్రగతినొందు!

పూలదీవెనెపుడు పొలుపుగా నీళ్ళోసి
పెంపు జేయవమ్మ ప్రీతిపొరల!
రంగు రంగు పూలు రమణీయముగనిచ్చి
పూలవాసనలను బులకరించు!

పల్లెటూరి బ్రతుకు బంగారు బ్రతుకురా!
ప్రేమ కొరలుచుండు ప్రీతి పొరలు!
తీయనైనగాలి తీరై నసీమను
నాదరించు మనల నాదరమున!

కొండలన్ని దరుగు కోనేరు లింకును
నదుల తీరు మారు గదులు భూమి!
మంచివారి మనసు మారదు జెరుగదు!
గతిని తప్పదెట్టి కాలమునను!

తోటివారినెపుడు పులకించు ప్రేమతో
మంచి మాటలాడి మమత జూపు!
తొలకరి జినుకులను బులకించి నట్టుల
మనసు బులకరింప మదిని దలపు!

ప్రేమ పొంగులార! ప్రీతి కేకిసలాడ
సేవజేయవయ్య భావమలర!
నరుని సేవయె యిలను నారాయణుని సేవ
యనుచు మదిని దలపు నాత్మశుద్ధి!

ఆర్తజనుల నెపుడు నరయుము దయతోని
బాధనుండి బాపి బరువుదీర్చి!
ఇష్టమేదో దీర్చి కష్టము బరిమార్చి
కౌగలించుకొనుము గలత దీర!

అన్నమన్నమనుచు నాకలి దపియించు
దీన మానవులకు దిక్కుజూపి!
పట్టెడన్నమిచ్చి పరగ యాకలిమాన్పు!
నాదుకొనగ వలయు నార్తిబాపి!

రోగ పీడితులకు రోదన వే మాన్పి
మందు మాకు నిచ్చి మమత జూడు!
సేద దీర్పవలయు జీకుజింతల మాన్పి
గుండె దిటవుగాగ కూర్మి నెఱపు!

నిస్సహాయులగుచు నిర్వేదనమునందు
వృద్ధ జనులగాంచి శ్రద్ధ జూపి!
కట్టుబట్ట నిచ్చి కడుపాకలిని మాన్పి
యాదుకొనగ వలయు నాదరించి!

మంచి పనులకెపుడు మారని దృఢమైన
పట్టుదలను గలిగి బరగవలయు!
నిష్ఠగలిగియున్న నిండు సంకల్పము
ఫలము జేతికందు ఫలిత మిచ్చు!

స్వార్థరహితమైన శుద్ధ నిష్కల్మష
కార్యములకు నెల్ల గలుగు జయము!
ఆది కార్య విఘ్న ములసటు గల్గిన
సానుకూలమగును సార్థకముగ!

ఎట్టి భారమైన యెట్టి కార్యంబైన
మంచి మనసుతోని మలచి కొనుము!
కార్యమాగిపోవ కఱిగి పోవకు మది
కార్య సఫలముననుగంతు లిడకు!

పురుష యత్నమునను బూనిక జూపుము
దైవ మరసి యిచ్చు తగిన ఫలము!
పురుష యత్నము లేక పూచిక పుల్లయు
కదలలేదు మఱియు మెదలలేదు!

కార్య సాధనమున గలిసి ముందుకు సాగు
మంచి కొఱకు ప్రజల కంచితముగ!
వేలదేవతలును వెంట వేడుక నుండి
శుభములిత్తురయ్య శోభనముగ!

సంపదలిల గలవు సకలమున్నది జగతి
కొంతలంత గలవు గోర్కెదీర!
నరుడు దారిద్ర్యమున నలుగుట యెందుకో!
తెలియవోయి! దఱచి తెల్లముగను!

అమ్మ యాకలనుచు నఱచేటి శిశువుల
చేతముద్ద బెట్టి చేవతేని!
తల్లులెంతమంది తలడిలు చుండిరో!
కారణం బదేదో! కనుల గనుము!

రాత్రి బవలు శ్రమను రాజిలుచునుగూడ
కూడు గుడ్డలేక క్రుంగిపోవు!
శ్రామిక జనములకు జైతన్యమెప్పుడో!
విరియగలదొ గనుము! వేడుకలర!

యంకురించిన మది యనురాగమధురిమ
సర్వజనులతోని సఖ్య మొసగు!
శత్రువైన గూడ మిత్రుడై చరియించు
విషము నమృతమగు వేయునేల?

కనికరమను నదియు కల్పవృక్షము సుమా
దయను బెంచుకొనుము దారినీకు!
నిండు హృదయమగును నీతి వర్ధిల్లును
పూలబాట యగును పుణ్య ఫలము!

వేన వేలుగలరు విధివంచితులిలను
కూడుగుడ్డ లేని క్రుంగు జనులు!
కఠిన శ్రమను జేయ కడుపునిండనివారు
నాపికొనుము వారి సరసి ప్రేమ!

చేసెడి శ్రమ యిలను జేతికందని వారు
కొంప గోడిలేక కుములువారు!
బ్రతుకు పైని యాశ పల్లెత్తులేని యా
బీదజనులగాంచి సేద దీర్పు!

మానమమ్ము కొనుచు మమతను విడనాడి
పొట్ట బోసికొనెడి పొలతులగని!
కంటినీరు దుడిచి కనికరమున జూచి
దారి జూపవోయి ధర్మబుద్ధి!

సంఘమందు నున్న సకల దుర్వ్యసనము
లన్ని దుడిచివేసి యార్ద్రబుద్ధి!
మంచి సేయవోయి! మహియందు నీ పేరు
దలచికొనగ జనులు ధర్మ బుద్ధి!

హెచ్చుదగ్గులిలను మచ్చను మాన్పగా
మతము కులవిభేద మంతరింప!
సంఘ మభ్యుదయము సాధింప బూనుకొను
మార్పుకొఱకు మంచి చేర్పు కొఱకు!

అంటరానివారు అవల యుండుడటంచు
ఛీదరించి దరిని జేరనీక!
ఆదరములేని యట్టి నిర్భాగ్యులు
కోట్ల కొలది గలరు పాట్లుబడుచు!

కుక్క, కోతి, పిల్లి, కూర్మి పెంచెడి నరు
లట్టి సాటివారి సంతుకొనరు!
మనిషికున్న యట్టి మలిన మదేమియో!
విప్పిజెప్పబోరు తప్పదేమొ!

మనిషికిట్టిబుద్ధి మాలిన్యమది యేమొ!
తోటి మానవులను దూరు టెంత!
తప్పుగాద! దలపు! ధార్మిక బుద్ధితో
మార్పు జేయవోయి మనిషి బ్రదుకు!

శ్రమను దోచుకొనుచు జనుల స్వేదము జింప
పొట్ట నింపుకొనెడి పురుషులిందు!
అఱచి బలుకు చంద్రు నారని భక్తితో
ధర్మపన్నములను ధాత్రియందు!

భూరి సంపదలిల బొరలుట యొకచోటు
గ్రుడ్డి గవ్వలేని గుడిసె లొకటు!
విందు భోజనముల విపరీత మొకచోట
పట్టెడన్నములేని పాటులొకటు!

డంబమెపుడు వలదు దరిజేరవలదు సూ!
అంబరమున కెగిరి క్రింద బడెదు!
వేషభూషణములు వేసగాండ్రకుదగు
డంబ మెపుడు వలదు ధార్మికులకు!

ఎదురు ప్రశ్నవేయి యెందుకు? యెందుకు?
ఇట్టి రీతినీతి పుట్టి పెరిగె?
ఎవరు కారణమిల యెందుఁ కిట్టుల
మనిషి బ్రతుకు నెవరు మార్చిరిటుల

పట్టు వస్త్రములును బంగారు నగలును
పూలదండలు మఱి పొలుపులేల?
చక్కనైన మాట చిక్కని భూషలు
మనిషి కీర్తి కెక్కు మహిమ జెంది!

అతిశయమును జూప యాడంబరము జూప
పాటి జేయరతని సూటి నెవరు?
లొట్టి పిట్టలోని లోపాలు దెలియగా
పస్సి చాలు! వాని వగలు చాలు!

అతిశయంబులేని యనునయ వినయము
సాధువర్తనములు సరసమైన!
మాట.మంతి పలుకు మర్యాద వర్తన
సభఁకీర్తి జెందు సాధుజనుడు

గాంధితాత లోక కళ్యాణమునకునై
ముంగ వస్త్రమునను యఖిలలోక!
యంచదిరిగి కూడ యాదరమును బొంది
కీర్తిగనడె? దివ్యమూర్తి యనరె?

వేషభాషలందు భూషణములయందు
విందులందు మఱియు వేడ్కలందు
మితము పాటి చేసి మేలును బొందుము
మితము కన్న వేఱు మతము లేదు!

కోపతాపములను కోసలంటు కొనకుము
నిర్మలత్వము నను నిర్భయముగ!
జీవయాత్ర గడుపు జీవులయందున
యాత్మసము లటంచు నరసిచూడు!

మనసున కొరయింత మాలిన్యమును లేక
నిర్మలత్వమున నింపుమయ్య!
కడిగినట్టి ముత్యమును వోలె భాసిల్లి
మల్లెపూవువోలె మనసు నింపు!

కష్టసుఖములందు గదలకు జెదరకు!
నపజయంబు జయము హద్దుమీర
నిలిచి చూచుచుండు నిర్మల హృదయాన
దాటిపోవుచుండు దరికిరాక!

సంపదలను దూలి సరివారు యెవరని
పొంగి పోకు మదిని చెంగునెగిరి!
సంపద లుడిగేటి సమయమునందున
క్రుంగి యేడ్వబోకు రంగుబోవ!

ఆకు చిగురువేసి యందాల పూవుల
మూటగట్టు కొనును మురిపెముగను!
అట్టి యాకు పూవు యా శిశిరమందున
నేలరాలు సృష్టి నిలకడింత!

కొండకోనలందు నిండిన మనసుతో
నున్న జాలుకదిలి సరసగీతి!
పాడుచున్న సరళి ప్రాసావ గుణమున
మనసు నుంచుకొనుము మథనబడక!

నిర్మలత్వమనగ నిశ్చలతత్త్వము
చిఱుత నవ్వునవ్వి చిన్నిపూలు!
రేక విప్పు విధము రేలును బవలుల
నాత్మసుఖముతోని యలరుమయ్య!

వినయమున్న యెడల విజ్ఞాన మంతయు
తనకు దానె వచ్చు ధర్మ విధిని!
వినయ మందు నున్న విశ్వంభరత్వము
తెలిసికొనుము దాని దలపు సతము!

వినయముండినసరి విశ్వమంతయు గూడ
గెలువ వచ్చును మఱి కేళిలీల!
చంద్రబింబముతోని శశిరేఖ దా వచ్చి
ముదముగూర్చుగాదె ముగ్ధలవగ!

పెద్దలందు జూపు వినయ విధేయతల్
ముద్దులందు కొనుము మురిపెముగను!
కార్యసాధనలకు గాగల పనులకు!
వినయ మొకటియున్న విజయ మగును!

విద్య నేర్వదలప వినయముగావలె
గురు విధేయుడైన గూర్మి పొందు!
వసుమతీశుడైన వర్జింప వినయము
రాదు చదువు! వ్రాతరాదు! తెలివి!

పేదరికముచేత ఛితిల్లు జనులకు
దారిజూపవోయి! ధైర్యమిచ్చి!
చీకటి యెదబాపి జిందించి దీపము
వెలుగు జూపవోయి వేడుకలర!

చింకిగుడ్డతోని చిన్నారి పాపల
చంకనెత్తుకొనియు చేయిజాచి!
బిచ్చమెత్తుకొనుచు పిగులుట యెందుకో
కారణంబదేదో! కనుల గనుము!

కాళ్ళు లేనివారు కనులు లేని జనులు
కదలలేనివారు గలరు జగతి!
కాలుమెబ్బు విటుల గ్రమ్మట యెందుకో!
కారణం బదేదో కనుల గనుము!

కల్లగపటములను గడకు ద్రోయుము వేగ
చిల్లికజ్జములను జేరబోకు!
నిర్మలముగ నుండి నిండారు మనసుతో
ప్రగతి కొఱకు పోరు ప్రతి నిముసము!

బండచాకిరియును బహుశ్రమ గ్రుంకేటి
శ్రమిక జీవుల నెఱి చెంత జేరి!
బ్రతుకుబాట దెలిసి బాధను దీర్పగా
బ్రతినజేయవయ్య! యతిశయముగ!

చుక్కలెన్నియున్న స్ఫూర్తి జనింపదు
ఒక్కచంద్రుడున్న యూగుమనసు
బక్కచిక్కినట్టి పశులువేయేలరా
ఒక్కగంగిగోవు నొనరజాలు

శీలమింతలేని స్త్రీపురుషాదుల
మదిని మెచ్చరు గద! మాన్యవరులు!
కలుషమైననీరు ద్రావరు గానరు
నిర్ధరిత్రి నీతి యింతగాదె!

ఎన్నిసొగసులున్న వన్నెభూషణముల
పడతియందములను బడయలేదు!
అంకమందు శిశువు నలరియున్నప్పుడే
కాంత సొగసులన్ని వింతగొలుపు!

అన్ని పనులయందు నలరి యేకాగ్రత
కార్యదీక్ష గలిగి కథను నడుపు!
సగము సగము జేసి సాధింపకేమియు
మాటుమణగకోయి! తూటుబోవ!

శుద్ధ మనసుతోని వర్థిల్లు జగమున
పాల మనసుతోని బ్రతుకు భువిని!
మంచి నడత గలిగి మహియందు వర్తిల్లి
స్వామిదయను గనుము! సరసరీతి!

దాత వగుచు ధరణి దయగలిగుండుము!
బుట్టినందు కిలను భూమి ఋణము
మాతృ ఋణము దీర్పు! మరియాద మఱువకు
దైవభక్తి గలిగి ధరణి మెలగు!

మంగళంబుగ జగమంతయు వర్థిల్ల
కోరుకొనుము జిన్ని! ఖీతిజెలగ!
సుఖము సౌఖ్యములను జెన్నొంది జనులంత
శాంతి కాంతి ప్రగతి ప్రీతి వెలయు!

# ఱెక్క విరిగిన పక్షి

## (కావ్య ఖండిక)

ఱెక్క విరిగినట్టి పక్షి పలుకులు విను!
మనసు నందు గరుణ మమత గలుగ!
పృధివి దుఃఖితులను వ్యధల దప్పింపగా
పాటు బడుము జిన్ని! ప్రతినతోని!

ఒక్క నాటి బవలు నొయ్యారముగ నేను
పెంటి పావురంబు జంటనుండ!
నింగి నెగురు చుంటి నీలి గగనమునందు
నందమంత దొలుక చిందుచుంటి!

చల్లగాలి వీచ చదలంత నీలము
నాటలాడు నటుల యలరుచుండ!
పూల వాసనలను గాలి తెమ్మెరలతో!
గగన మంత బఱచె కమ్మదనము!

అది వసంత ఋతువు నటుగాన వగలతో
ప్రకృతి కాంత గూడ బరవసించె!
పచ్చదనముతోని బసుపు వన్నియలతో
అందచందములను జిందుచుండె!

కలకల ప్రవహించి కదిలేటి సెలయేళ్ళు
నదులు నిర్మలముగ నటన సలిపె!
చిన్న పిల్లలవలె చిగురు జొంపములును
జిందులాడ జొచ్చె యందముగను!

ప్రకృతి యందములను బరికింపగా మేము
గూడువదిలి చిన్ని కూఁలమటి!
వదిలివచ్చితి మలవ వరుసగా జరిగిన
అతి విషాదగాథ యాత్మ వినుడు!

ఇంతలోనె యొక్క వింత రాక్షసువలె
గ్రద్ధ యొకటివచ్చి గానబడియె!
మమ్ము జూచి పొంగి మనసు గర్కశముగా
వెంబడింపసాగె వేగముగను!

అయ్యో! యనుచు మేము నంబర వీధిని
యార్తనాదములను యఱవి యఱచి!
భయము నార్తి గదుర బాధను సూచించు!
రోదనమున బొగిలి జెదర మనసు!

పెంటినేను గలిసి జంటగా బహుదూర
మెగిరి యెగిరి యలసి సొగయ మనసు!
తిరిగి జూడ గ్రద్ద దిన్నగా మామీద
చూడ్కినిలిపి జేర దాపునయ్యె!

ఎట్టి దుర్దినమిది యెట్టి చెడు వేళలో
నిద్రలేచి నామొ! నిష్ఠురముగ!
ఎవరి కెపుడు మనము నెగ్గొనరించితో
ఇపుడు వచ్చె మనకు నింత జేటు!

లేడిపిల్లబట్టు వడివడి యేతెంచు
పెద్దపులికివోలె భీకరముగ!
గ్రద్ధయదిగో! యదిగో! ముద్దియు! జూడుము!
మృత్యువింక మనకు సత్యముగను!

దేవకన్యలట్టు దిశల నిశాచరు
దరుగు నట్లు దిశల జరుగుచుండె!
మార్గమేది మనకు మరుగు జొచ్చుటకైన
దాపు లేదు మఱియు దరియులేదు

ఒకరి జోలిలేక యొకరి కయ్యములేక
సాధుజీవనముల సాగువారి!
దుష్టజనులుగాంచి దూర దూరమునుండి
చుట్టు ముట్టి కష్టబెట్టు చుండ్రు!

ఎచ్చట మనయూరు నెచ్చట మనపల్లె
యెచట మనదు గూడు? నెచటనుండి!
చిన్ని చిన్ని గ్రుడ్ల జిన్నారి పాపల
వదలి యింత దూర మొచ్చినాము!

చల్లగాలి యందు జల్లు సువాసన
నీలగగన మందు నీటు గులుక!
ఈల పాటతోని యూహాలు జెలరేగ!
వచ్చినార మిపుడు వాంఛమీర!

ప్రకృతి మాత యొడిని బరవశ మందగా
జింతజేయనిటుల జేటువచ్చె!
మంచివారికెప్పుడు మన్నన లేదుగా
చావు దప్పదిపుడు సఖియ! మనకు!

సఖియ మాటలేదు! సరసమా భావము!
తెలుపలేదు తెలియదేటబఱచి!
కంటనీరు తెరలి కాల్వలు ప్రవహింప
పొగులుచుంట కంటి రగుల మనసు!

సఖియ! వినుము? నాదు సవ్వడి పలుకుల
గతిని దప్పరెవరు కాలగతిని!
దైవ నిర్ణయములు ధర జరుగుచుండును!
నాపవశమె యిలను నజునికైన?

గ్రద్దయదిగోవచ్చె! యిద్దఱ నొక్కరు
యాహుతి యిది నిజము! యాపలేము
నేను బలి యగుదును నీవు దప్పించుక
తిరిగిపొమ్ము గూడు త్వరితముగను!

మేతవేళదెచ్చి మెలకువ చిల్లల
బెద్దసేయు ప్రేమ పెంపు మీర!
క్రూర ఖగలకును దూరము సేయుము
ఱెక్కలొచ్చు వఱకు నక్కజముగ!

గూటి పాపలునిను గూరిమి జూతురు
అమ్మ యెపుడు వచ్చునన్నయాశ!
నిక్కి నిక్కిజూతు రక్కజముగగూట
నణగిపోవ నీదు నక్కునందు!

నాన్న యేడి యనిన నగు మొగంబున గాంచి
దూరమేగెననుచు దువ్వి మేను!
చిన్నిచిన్ని ముద్దు సింగారములు సలిపి
కౌగలించుకొనుము గారవమున!

అట బుడతల వారి యయ్యల గనిమాదు
'అయ్య యేడి' యనుచు దియ్యనడుగ!
నిజము జెప్పి వారి నీరస బరుపకు!
గుండెజేసి కొనుము! బండరాయి!

కలుగు కష్టములను గలతల దలచుచు
కంటనీరు వెట్టి గలత బడకు।
కంటనీరు నదిమి గలుగు గద్గదికము!
నణచియుంపు పాపె లరయకుండ।

నీతి నలరి దెలిపి  నిర్మలవంతుల
జేసి జగతి ప్రగతి శీలురుగను।
సాధువర్తనుల సత్పథగాముల
తీయనీ మనసున తీర్చిదిద్దు!

తండ్రిలేనివారు దగవేమి రాదనుచు
యొరులు గొట్టదిట్ట వచ్చిరేని!
సహనమును వహించి సావధానమునుండి
దగవు బెట్టుకొనకు। జక్కనుండు!

నీదు నాదు ప్రేమ నిర్మలమైనది
మధురమైన ప్రేమ మాసిపోని!
అమలమైన ప్రేమ యట్టిట్టు దొలకని
తిరిగిపోని ప్రేమ! తరుణి మనది!

అనుచు నేను బలుక యుట్టిట్టు బలుకక
కంటె నీరు దొలికి గగనమందు!
నూత్న వర్షధార నుర్విగావించుచు
అంటివచ్చుచుండె జంటపెంటి!

అంతలోనె గ్రద్ద యతి వేగమున వచ్చి
తారసిల్ల పెంటి తడబిడ బడ!
కొంతతగ్గె గ్రద్ద పొంతకు నే బోతి
వాడిగోళ్ళ నన్ను నదిమిబట్టె!

గ్రద్ద గోళ్ళజిక్కి మొప్పుగ నేనుంటి
రక్తచందనమున రాజిలంగ!
కత్తిగోళ్ళలోని గసిదీర నదుముచు
రక్తధార జేసె రవలుగొలుప!

పెంటి వెడలిపోయె కంటి దూరముగాగ
కంటి నీటిధార కాల్వగట్ట!
దూరమేగి నిలిచె చూడుచు కాలుని
కనులు మూసికొంటి కదలలేక!

గ్రద్ద కాలిగోళ్ళ కడు బాధలోనుండ
కదులుచుండె గ్రద్ద గగనమందు!
ఆడుచుండె పొంగి యానందమున నింగి
ఱెక్కలార్చుకొనుచు నిక్కి నిక్కి!

కొండ కోన దాటి కొలకుల నటు గ్రద్ద
పర్వతముల నదుల బరగదాటి!
ఒక్కయడవి దాపు యొయ్యాన దిగనుండ
డేగ యొకటి దాకె వేగ దాని!

డేగ గ్రద్దనంత గగనమందున కని
కుమ్ములాడుచుండ కర్మగతిని!
కాలిగోళ్ళనుండి కదిలి రయంబున
క్రిందబడితి పొదల బందిగాగ!

నెత్రుముద్ద నైతి నిలువున జీరిన
మాంసముద్దనైతి మఱల నేను!
బలుకుచుంటి నేను పలు భాషలను మరి
జీవి చేష్టయింత చిత్ర మిదియు!

ఱెక్క విరిగె నొక్క ఱెక్కతో రెపరెప
లాడుచుంటిగాని లావుతేక!
త్రుళ్ళిపడుచు నుంటి దూరమ దూరము
పడుచు లేచు చుంటి ప్రల్లదమున!

చెప్పరాని బాధ యొప్పగ యిదియని
పలుకలేని బాధ పరులకేరి!
గుండెలోనిదంత గుమరుగా జెప్పగా
చిత్తమందు గలదు! శక్తిలేదు!

ఎటుల దెలిపి నేను వేసట జెందుదు?
పరులు యెవరులేరు పరవశముగ!
మనసు బాధ దెలిపి మర్మముగా బ్రాణ
మొదల మనసు గాని యొరులులేరు!

చావు దప్పదింక జనుట నిశ్చయమింక
ఱెక్కవిరిగె నాదు స్రుక్కె మనసు!
అంతదాక నాదు నా బాల్య చరితము
నెమరువేసి కొందు నిండుమనసు!

మావి చిగురు వంటి మధుర వసంతము
చిన్ననాటి తనము చిత్రమంత!
ఆడిపాడి సతత మానందమున దేలి
యలలవోలె యెగసి పడుచు నుంటి!

అమ్మ యిచ్చుమేత యాదరమున దిని
యాడి యాడి పాడి యలసిపోయి!
అమ్మయొడిని యొదిగి యలసతదీరగా
నిదురబోవు టెంత నిండు ప్రీతి!

6)

దిగులు జింతలేక దీనత్వమును లేక
జడుపు ఘోరమనెడి బాధలేక
ఆకుచాటు నున్న యందాల పిందెలా
బ్రతుకు నెంత ప్రీతి బాధలేక!

మధురమైన చైత్ర మధుమాస మేతెంచె
దక్షిణంపు గాలి తన్మయమున!
వీవసాగె గాలి పూవుల భరిణయై
పరిమళములు భూమి బంచసాగె!

మావిగున్నపైని మధుర కోకిలగాన
మావరించె వనము మధురముగను!
జంతు జాలమంత జంటలు జంటలు
కామ దాహమునను గదలజొచ్చె!

చిలుక బలుకు బలికె చిత్రమౌ గోరింక
పూల పొదలనుండి పులకరించె!
ఆటలాడి యాడి పాటల తుమ్మెద
పూవు పూవువ్రాలి పులకరించె!

గ్రీష్మ ఋతువువోలె గ్రీష్మము నను జుట్టి
వచ్చె యౌవనంబు పగలుజింద!
మనసు రాగమయము మధురమౌ భావాలు!
చుట్టు ముట్టె నన్ను జోద్యముగను!

అందమైన పెంటి యతివను నే బొంది
మనసు నిచ్చి మఱల మనసుగొంటి
గూడు కట్టుకొనియు క్రొత్తకాపురమును
మొదలు బెట్టినాము మోదమలర!

పల్లనిగాలుల సంపంగి పూవుల
మల్లెపూవులందు మసలినాము!
తీయనైన వలపు తేనియ చవిజూచి
యనుభవించినాము సమర సుఖమున!

వర్షఋతువు నందు హర్షమునను దేలి
సఖియ నేను మిగుల సంతసమున
చిన్ని గూడునందు జిటపట జినుకుల
వర్షధారలందు యొదిగి యొదిగి!

తరుణ యౌవనమును తలచి నే జెప్పగా
సిగ్గుతోని నేను శిరము పైకి!
యెత్తి మాటలాడ చిత్త వికలంబగు
సతికి బతికి దెలియు సర్వముగను!

ఎన్ని యూహలు మఱి యెన్నియో భావాలు
మోరలెత్తు చుండు మోదమునను!
కలలుగాంచు చుండు కమ్మని తీయని
నవ్యభావములవి యౌవనమున!

తెలుపులు విరజిమ్మె తేజము వర్ధిల్లె
నల్లమబ్బులన్ని తెల్లనాయె!
గగనవీధి జ్యోత్స్న కమ్మగా వెలుగొందె
చుక్కలన్ని విరిసె చోద్యముగను!

తరుణ యౌవనమది దగనిచ్చు ప్రేమగా!
మధుర మాయె మనసు మనసు గలిసి
గాఢమాయె ప్రేమ కదలని కుందగా
పూలపడవవోలె బొలుపు గులికె!

నిండు చూలాలయి నిలిచెను నా పెంటి
సిగ్గు తెరలు దించి నిగ్గు తెలయ!
ఆదుముకొంటి నురము జిదుముచు మోమున
'పుత్రవతివి గమ్మ! హాలతి!' యనుచు!

అంత హిమ ఋతువును సంతస ముప్పొంగ
తెల్లపీర తోని నుల్లమలర!
తెల్లమంచుదెరల నుల్లాసమును జేసి
బంతిపూల జడను నింతివలెను!

ప్రసవ మొందిన దదె బాల నా ప్రియసఖి!
మూడు గ్రుడ్లు బెట్టి ముచ్చటగను!
పొదిగి బిడ్డలుగను బొలుపుగా జేసెను
ఎవరు నేర్పినారొ! యిట్టి వింత!

చిన్ని బిడ్డలగని జిందుచు సంతస
మంతరంగమందు నందినాము!
సాకు చుంటిమంత సంతోషమలరగా
ఆకురాలు కాలమంత వచ్చె!

పండుటాకులన్ని బటపట శబ్దించి
రాలిక్రింద బడియె రవలుజిందె!
చింతవంతలేని శివలింగమునువలె
మోడులయ్యె దరులు మునులవోలె.

దూర దూరమునను నూరటు జెందక
మేత దెచ్చి బెట్టి మేలిమిగను!
మచ్చిక కడు మీర మనసు నుప్పొంగగా
ప్రేమ పెంపుగాగ బ్రీతి జింద!

ఆలుమగల మిట్లు నలసట యదిలేక
పెంచుచుంటి మిటుల ప్రేమమీర!
ఊక్కలింకరావు చిక్కని రూపము
చక్కరాదు బలుకు నొత్తి బలుక!

మఱల మధురమైన మధుమాసమేతెంచె
దక్షిణంపుగాలి తన్మయమున!
వీవసాగె వనము పూవుల భరిణయై
పరిమళముల భువిని బంచసాగె!

మానిగున్న పైని మధుర కోకిల గాన
మావరించె వనము మధురముగను!
జంతుజాలమంత జంటలు జంటలు
కామదాహమునను గదలజొచ్చె!

చిలుక బలుకు బలికె చిత్రమౌ గోరింక
పూలపొదలనుండి బులకరించె!
ఆటలాడి యాడి పాటల తుమ్మెద
పూవు పూవువ్రాలి పొలుపుచిందె!

ఊక్కిలింకరావు చక్కగా యెగురగా
పాదములను నింక బలిమిరాదు!
ఎగుర జాలవు భువి దగ బ్రాకజాలవు
సాకుచుంటి మిట్లు తన్మయముగ!

మేమువచ్చు దనుక మెలకువగా నుండి
నోళ్ళు దెఱచి యుండు గాళ్ళు ముడిచి
నోటబెట్టుమేత మెలకువ భుజియించి
నిద్రవోవు నాడుల నీటుగాగ!

కుళ్ళు పెంచు చుండ యిట్టి యాపివసచ్చె
భ్రష్ట వలన మాకుగలిగె విపద!
తీయతీయని కల చిందిన స్వర్గము
మాసిపోయెనింక మనసు చెదర!

తండ్రి దిక్కులేని తనదు బిడ్డలకిక
దిక్కు నెవ్వరింక దీప మెవరు?
చదువు సంధ్య జెప్పి చక్కని సంస్కృతి
జ్యోతి నెవడు జూపు ప్రీతి జేసి?

ఉనవత్లైన వారి నతిన జేయునదేమి?
సుతుల నెట్లు పెంచు మతుల దీర్చి?
కనిన ఋణము దీర్పగావలె దండ్రికి
సుతులు దీర్ప వలయు గతులు గూర్చి

రక్త చందనమున రాజిలగోరెడి
పొప్పుకుందు నందు బరగు చంద్రు!
సజ్జనులకు పాలి శత్రువులై యుండి
కరుణలేక యుండ్రు గరినముగను!

పరుల ధనమునకును బిరదారలకునయి
పంచమాడి యింత చింతలేక!
యపహరింత్రు వారి యహము కద్దములేదు!
రీతిలేదు! పాప భీతిలేదు!

ఖండ ఖండములందు గలరిట్టి దుష్టులు
సకల జాతులందు సర్వులందు
రక్తపాతమునకు రహిబొంచి యుందురు
మమత సమతలేక మంచిలేక!

ఆరిపోవు దీప మాఖరిక్షణమున
దెలుపుచుంటి మదిని తేటగాను!
పూవు దీగెలార! పొలుపుగా పొదలార!
తరువులార వినుడు! తన్మయముగ!

ఱెక్క విరిగి పడిన పక్షిని నేనైతి
సతిని, సుతులనుండి జారిపోతి!
ఇట్టి యాపదలను నెవరికి రాకుండ
రక్షసేయుమయ్య! రంగుమీర!

మిడిసి పడెడివాని మిత్తెక్కి తొడగొట్టి
సాధుపురుషులను సజ్జనులను!
కష్టబెట్టువాని గడు దుష్టుడగువాని
మట్టు బెట్టుమయ్య సుఖచిదయను!

కలిసి దుష్టు నణచి కావర మడగించి
బలము దర్పములను బారద్రోలి
యైకమత్యమునను సెగు కార్య మదియెల్ల
దుష్ట శిక్షణమది దొసగుగాదు!

అనుచు బ్రాణమొదలు నా పావురాయిని
దయను జూడవోయి! ధర్మబుద్ధి!
హంతకులను నడచి చింతను దొలగించి
భువిని జేయ వలయు పుణ్యభూమి!

చెప్పినట్టి మంచి చెన్నుగా మదినుంచి
దీప శిఖను వోలె తేజమలర!
మానవత్వమనెడి మహనీయ దీప్తితో!
వెలుగు నింపవోయి వేడ్క భువిని!

విశ్వమంత విమల వెన్నెల జిందగా
మనిషి బ్రతుకునందు మార్పురాగ
శాంతి కాంతి ప్రేమ సరసత విరియగా
స్వస్తియగునుగాక సర్వజగతి!



# రాలిపడినపూవు

(కావ్య ఖండికలు)

రాలిపడిన పూవు రాగాలు వినవయ్య
పడిన పండుటాకు బాటు వినుము!
ఱెక్క విఱుగపక్షి యక్కజమగు బలుకు
మనసు నందు దలచి మథనబడుము!

చిన్ని తీవెయందు జిన్నారి మొగ్గనై
యాకు చాటునందు యవతరించి!
కొమ్మ చాటునుండి కోకిల పాడగా
పులకరించి నేను పూవునైతి!

చిన్నిగాలి తెరలు జిఱునవ్వు నవ్వుచు
నూయలూప నేను నూగి సోలి!
కలలు గంటినయ్య కమ్మని కలలను
పేకమేడలయ్యె బేర్మి కలలు!

రాణిగారి శిగను రంజిల్లగోరితి
రాజుగారి చేత రవలుగొలుప!
పల్లెటూరి పడుచు బరువంపు గొప్పపై
నిలువ గోరితయ్య నీటు గులుక!

పెళ్ళిగాని పిల్ల పేరంటములయందు
పూల బుట్టలందు బొలుపు మిగుల!
పూల జడను నిలిచి బొలుపార యందాలు
చిలక గోరితయ్య జింద మనసు!

గొబ్బి లక్ష్మిపైని గోరంత శిరమెత్తి
గొబ్బిపాట వినగ యుబ్బిపోతి!
స్త్రీల శిగలయందు వాలుజడలయందు
నిలువ గోరింతయ్య! నిర్మలముగ!

తల్లి పూజసేయ దగ నెవరైనను
వచ్చి త్రుంతు రనుచు వగలుబడితి !
కనికరించి యెవరు గనరుగా నా కోర్కె!
యంటరాని దాని వనుచు బలికి!

శివునిపూజసేయ జిదిపి నన్నెవరైన
మాల గుత్తురనుచు మనసుబోతి!
చూచిపోవు వారె త్రుంపరు యెవరైన
కలగిపోతి మనసు కాంతి తగ్గి?

గ్రుడ్డి పూవునైన కులమందు వెలినైతి
లోకజనులచేత దూరబడితి!
అంటరాని తనము హత్తుక యెన్నాళ్ళు
మొగమునెత్తి జనుల మోము జూతు?

అనుచు నిట్లు దలచి మాత్మలో బరమాత్మ
మనసునందు దలచి మధన బడితి!
అంత నొకట గాలి యటు నిటు వీవగ
జారి తీవె నుండి ధరణి బడితి!

దూరముంచి మమ్ము ధూళి ద్రోయకుడయ్య!
యంటరాని తనము నంటగట్టి!
హృదయమున్న మీరు మది దయ గనరయ్య!
కంటనీరు జూచి గలగుడయ్య!

రాలిబడిన పూవు రాగాలు వినరయ్య!
లోకమందు గలుగు రోదనములు!
దిక్కుమొక్కు లేని దీన జనావళి
యార్తిబాపి వారి నాదుకొనుము!

---

# వసంతోత్సవము (ఉగాది)

[కావ్య ఖండిక]

సృష్టియందు మిగుల యిష్టమౌ వాసంత
ఋతువునందు మిగుల ప్రీతిగాక!
మావి గున్నయందు మధురమౌ నొకకొమ్మ
రెమ్మయందు దొడిగి సమ్మతముగ!

మధురమైన యట్టి మధుమాస మేతెంచె
దక్షిణంపుగాలి సమ్మతముగ!
వీవసాగె వనము పూవుల భరిణయై
పరిమళముల నొలికి బంచసాగె!

మావిగున్న పైని మధుర కోకిలగాన
మావరించె వనము మధురముగను!
జంతుజాలమంత జంటలు జంటలు
కామదాహమునను గదలజొచ్చె!

చిలుక పలుకు బలికె చిత్రమౌ గోరింక
పూల పొదలనుండి పులకరించె!
ఆటలాడి యాడి పాడెను దుమ్మెద
పూవు పూవు వ్రాలి పొలుపు మిగుల!

మంద మారుతములు మహిని చలింపగా
మావిగున్న పొంగె మధురముగను!
క్రొత్తకోరికలను క్రొంగ్రొత్త యాశల
మావిచిగురు వేసె మధురముగను!

చిన్ని చిగురునైతి చిన్నారి మావిని
మిసిమితళుకు మెరిసె మేనిపైని!
స్వర్గ కాంతిరేఖ సరసత నొలికిన
మెఱుపు దీవెనైతి మేఘములను!

చిఱుతగాలి నాడి చిన్నారి చేష్టల
వయసువచ్చి నాకు వన్నె వచ్చె!
పూవు పండ్ల నెన్నొ పొలుపుగా నిచ్చితి
సాధుజనులకెల్ల సంతసమున!

కఠినమైన యెండగాడ్పుల జూచితి
వర్షపాతములను వన్నెగాంచి!
వెన్నెలంత త్రాగి వేయిదీరుల బొంగి
మంచుతెరల మునిగి మాటువడితి!

కష్టసుఖములెన్నొ గాంచితి ప్రజలార!
సౌఖ్యరోదనముల జాలగంటి
లేమి సంపదలను లీనమై యుంటిని
క్రుంగలేదు! మదిని పొంగలేదు!

ముదిమివచ్చె నాకు మోమంత పండెను
ధరణిబడితి నేను తడబడంగ
ఆయువంతదీరి యంతమదినముల
కందిపోతి మనసు చిందిపోతి!

పాలివారు వచ్చి బలుకరింపగలేదు
తొంగి చూడలేదు దోటివారు!
నవ్విపోవువారు నగుబాటుజేసెడి
వారు వారు వరుస వచ్చినారు!

మంచి దినములందు మాధుర్య మొలికించి
కష్టకాలముననుగ గరిసముగను!
ఉండెనేమొ సృష్టి యున్నది తెలియక
మోసపోతినయ్యొ! మూఢ మనసు!

పొంచ భౌతికమని పదియారు వన్నెలు
యణగిపోవునంచు నరయనైతి!
తనదు బంధుమిత్ర తత్త్వంబు దెలియక
మోసపోతినియ్యొ! మూఢతమసు!

నవ్వబోకుడయ్య! ననుజూచి వికవిక
ముదిమినంచు పండు ముసలినంచు!
క్రిందిబడితినంచు గ్రీడగా నను జూచి
గేలిజేసి నన్ను గోలతోని!

బాల్య యౌవనములు బరగువయో వృద్ధు
లగుదురయ్య జగతి విదితముగను!
గాన వృద్ధులందు గాంక్షతో దయతోని
గాంచుడయ్య దయను గరుణ దొలుక!

విన్నపమిది నాదు వినుడు! ఓ ప్రజలార!
వయసు పోయి తరుగు వన్నెలన్ని!
ముదిమి వచ్చుపోవు ముదిత ప్రాణముగూడ!
సృజన లీల యిదియ! చోద్యమంత!

పడిన పండుటాకు పాటను వింటివి!
కంటి నీరు దొలుక కరుణ గలుగ!
వృద్ధ జనుల గాంచు పృథివిలో ఘనమగు
కార్యమిదియె చిన్ని! కల్లగాదు!

కలబోసిన ముత్యాలు
సూక్తులు - సుధామయ ఖండికలు
ఆటవెలది పద్యాలు సంపూర్తి



# కలబోసిన ముత్యాలు

## (సూక్తులు-సుధామయ ఖండికలు)

### గీత పద్యములు

గీ. హృదయ మందిర మందున సదయనుండి
తీయనైనట్టి పదముల దీరునిచ్చు!
రమ్యనీతుల దొరలించు భవ్యలీల
సరస సద్గుణ శ్రీజయ శారదాంబ!

గీ. చిన్ని బాలుర చిత్తముల్ చిగురుతెత్త
మంచి నీతులు మదియందు మరులుగొలుపు!
నీతి పథమున వర్తిల్లి ప్రీతి జెంద
నీతి పద్యము లల్లెద ఖ్యాతి దనర!

గీ. వంచనాత్మక మయిన యీ యుర్వి యందు
మంచి పెంచగ వలయును మమత జిన్ని!
నీతి సూత్రములను మది నింపుకొనుచు
సుజన మార్గము బయనింపు సురుచిరముగ

గీ. సంజకెంపులు విరిసిన సాధురీతి
మనసు నందున నింపుము మధురిమలను
చీకటులనన్ని దొలగించి చిత్రమైన
కాంతి వెలుగును భజియింపు శాంతిగలుగ!

గీ. బడికి వేళకు జనుదెంచి పాఠములను
శ్రద్ధగావిని మనసున సరసరీతి!
మనన జేయుము మఱువక మఱల మఱల!
చిలుక పలుకుల రీతిగా చిత్రముగను!

గీ. కలిసి చదువుము! బాలుర గలిసిచూడు!
కలిసిపాడుము! పాటలు కమ్మనైన!
ఆట పాటల వెనుదీయ కెప్పుడైన
సిరికి దనమును జూడకు బేలవగుచు

గీ. మాటలాడుట నేరిచి మధురముగను!
వినయ స్నేహము లొప్పగా విరియ మమత!
పెద్దలందున వినయము బేర్మిమీర
నమ్ర భావము మనసున నాట్యమాడు

గీ. నిత్య జీవిత మందున నీతిదనర
ప్రేమ భావము వర్తిల్లి ప్రీతిదనర!
వినయముండిన జాలును విశ్వమందు
అన్ని సాధింపవచ్చును నాత్మశక్తి!

గీ కష్టములగాంచి కళ కళ కఱగిపోకు!
సుఖములను జూచి జెలగుచు సోలిపోకు!
చిత్త సమభావముననుండి హత్తుకొనక
పవలు రాత్రులు గానెంచు భ్రాంతివీడి!

గీ. కష్టముల గ్రుంగి కన్నీరు దొలుకుచున్న
దుఃఖితుల దరిజేరుమా! తొలుక గరుణ!
బాధమాన్పగ వేదన బరువు దీర!
సేవజేయుము! ధీ శక్తి సిద్ధినంద!

గీ. త్యాగమయ మీ ప్రపంచంబు రాగమయము
సర్వ ప్రకృతి జీవులు సకల మిలను
త్యాగమున నిల్చియున్నవి జగతి సర్వ
ఆత్మ నలరించుకొను త్యాగమనవరతము

గీ. పూల మొక్కలు పూవుల బులకరించి
పరిమళము వెదజల్లుచు బరుల బిలిచి
దోసిలి నింప యత్నించు వాసిగాను!
ఆత్మ నలరించుకొను త్యాగ మనవరతము

గీ. నీలిగగనము నందున నీలిమేఘ
ములుము మెఱుపుల దోడుత నుర్వియంత!
వర్షధారల వర్షించు హర్ష మొప్ప
యాత్మ నలరించుకొను త్యాగ మనవరతము

గీ. మధుర ఫలముల నొప్పుచు మావికొమ్మ
రాతి దెబ్బల దినుచును రమ్యముగను!
వంగి ఫలముల నందించు వసుధ ప్రజకు
నాత్మనలరించుకొను త్యాగ మనవరతము

గీ. సూర్యచంద్రుల కాంతులు సురుచిరముగ
వసుధ యంతయు నొలుకును వన్నె లొలుక!
సకల జీవులు హర్షింప సాధురీతి!
ఆత్మ నలరించుకొను త్యాగ మనవరతము

గీ. భూమి బరువును మోయుచు మోము దమ్మి
చిఱుత నగవును జిందుచు జింతలేక
సూర్యు జుట్టును దిరుగుచు సుందరముగ
త్యాగమయ మీ ప్రపంచంబు రాగమయము!

గీ. శిశిర మందున రాలిన చిదుపలందు
మఱల క్రొత్తగ జీవురించు మధురిమలను
క్రొత్తవన్నెల మిసమిసల్ గోర్కె లలర
ధర్మమయ మీ ప్రపంచము కర్మ మయము!

7)

గీ. మూగవోయిన కోకిల మోరనెత్తి
కుహూకుహూయని కొనల కొర్కె దీర!
పాడుచుండుట యిది యేమి ప్రణయగీతి!
ప్రేమమయ మీ ప్రపంచము ప్రీతిమయము

గీ. తిమిరమందున బాడుము దేజమలర
కష్టముల యందు గనుమోడు కమ్మనైన!
సుఖము నానందములు నిల సురుచిరముగ
ధైర్యమును వీడకెప్పుడును దైన్యమునను!

గీ. బీటవారిన బీడుల భూములందు
తొలకరించిన భూముల బులకరించి!
పచ్చపచ్చని మొలకలు బల్లవించు
ప్రేమమయ మీ ప్రపంచము రాగమయము!

గీ. ప్రకృతి యందము వలువును వికృతిలేక
తనకు గల వంతయును ప్రేమ దరుగులేక!
ధారవోయును జనులకు ధర్మదృష్టి
ప్రేమమయ మీ ప్రపంచము రాగమయము!

గీ. ఏడ్చినంతనె బిరబిర నేగుదెంచి
శిశువు నెత్తుక దల్లియు జేర్చియెదను!
ముద్దు లాడును రోదన సద్దుమణగ!
ప్రేమమయ మీ ప్రపంచము రాగమయము!

గీ. జ్ఞానదీపిక వెలిగించు శూన్యమైన
మనసు లోపలి జీకటుల్ మాయమగును!
సర్వజీవులు సమమని సకల జనులు!
దమ్ములుగా నెంచు నాత్మశుద్ధి!

గీ. జాతికులమత వర్గముల్ రీతినుండి
భేదభావము దోషము బాదుకొలిపి!
కలహమున మున్గి యుండుట గలదె సుఖముగ
అన్నదమ్ములుగారొకో! యఖిల జనులు?

గీ. జాతిమతకుల వర్గాల జాతరలను
మనిషి రక్తము ప్రవహింప మాఁపగలదె?
మానవత్వము విలువలు మఱిగిపోవ
ఏమి సాధించినను గూడ యేమిసుఖము?

గీ. ప్రగతి మార్గము జనవలె ప్రజలునెపుడు
ప్రగతితోబాటు సంస్కృతి బల్లవింప
మానవత్వము లేని యామనిషియేల?
శుచియు శుభ్రతలేని యాసుఖ మదేల?

గీ. వ్యక్తి సుఖమున కాశించి వలనుగాని
కోర్కెలను నంద మానిసి గోరుచుండె!
సంఘశ్రేయస్సు నిసుమంత సరకుగొనడు
ఎందుకో యిట్లు నరుడయ్యె యెఱుకబడదు!

గీ. అర్థరహితములైన యీ యుద్ధములను
మనిషి యెందుకు జేయునో గానబడదు!
క్రూర కర్కశమైన యీకుత్సితములు
మనిషి మనిషిపై జేసెడి మాయని పగ!

గీ. స్వార్థమున జిక్కి మానిసి స్వప్రయోజ
నములతోడుత నెంతటి నటునకైన
చేయుచున్నాడు జూడుము! జిత్తవృత్తి
రాక్షసత్వము రగులుచు రవలుసేయు!

గీ  సత్యమును గలిగి గుర్తింపు సర్వవేళ
లందు గలరూపు గుర్తించి చిందమనసు
ఈశ్వరుండొక్కడే! జగదీశు మతము
నొక్కటేయని భావింపు నుర్వి మెచ్చ!

గీ. సత్యమన శాంతి ప్రేమలు సమత కరుణ!
అదియె పరిపూర్ణమైనది యంతరాత్మ!
శుద్ధజ్యోతి స్వరూపము శూన్యరహిత
మైన వెలుగది యదియ సూ! మా ధవుండు!

గీ. మనసువాక్కును కర్మము మధురముగను!
నొక్కరీతిని జరియింపు మక్కువగను!
నిర్మలంబైన కొలనిలో నీటిరీతి
సహజప్రాసాద గుణముతో సరసరీతి!

గీ. భువిని యుండెడి చేనుకు దివిని యుండు
మేఘమునకెట్టి సంబంధమేది గలదో!
అదియె మనిషికి మాధవునందు గలదు
తఱచిచూచిన దెలియును తత్త్వమంత!

గీ. అన్నివేళల యీశ్వరు నాత్మచింత
గలిగియుండుము గరుణము గలిగి యుండు!
సర్వభూతములందును సమత మమత
ఆత్మ యొక్కటియని మది యరసిజూడు!

గీ. మధుర ఆదర్శములతోని మానవత్వ
మున్నతోన్నత శిఖరముల్ చెన్నుమీరె!
సంఘమందున చైతన్య సంస్కృతులను
విరియగా జేయు వేవేగ విస్తృతముగ!

గీ. భిన్న ప్రకృతు లిల యెన్నో పేర్మిగలవు!
సాధనా మార్గములు నెన్నో సంఘమందు!
అన్నిమార్గములొక్కటే యెన్నియున్న
వాదులాడకు జగడముల్ వ్యర్థమనుచు!

గీ. ఉన్నతంబైన విద్యను నుర్వి నంద
దలచితేని నిరంతర తిరుగులేని!
శ్రమను జేయగవలయును సరసరీతి
సుఖము నిద్రాలసత్వము శూన్యమవగ!

గీ. దేవుడిచ్చిన జ్ఞానము, ధీరబుద్ధి!
చిత్తమంతఃకరణముల జేర్చి నీవు
సాధుమార్గము బయనింపు సవ్యమైన
బాట పయనింపు బంగరు బాటగాగ!

గీ. పరులమేలును దలపుము పాలమనసు
వెల్లివిరియగ యాత్మలో విరులు విరియ!
పరులమేలును జింతించు భావుకునకు!
ఇహము పరమును గలుగును ఎందునైన!

గీ. విషము మ్రింగిన శివునకు వేనవేలు
జనులు సాష్టాంగములతోని ప్రణుతు లిడుదు!
రట్టి మార్గము నీవును నరసిజనుము!
పరులమేలుకు శ్రమనోర్చి బాధబడుము!

గీ. హెచ్చుదగ్గులు లేనట్టి యుచ్చనీచ
భేద భావము లేనట్టి ప్రగతిశీలి!
వగుము! ప్రేమించు నందఱ జగమునంత
మానవత్వము పెంపొంద మనసు విరియ!

గీ. మనసు నిద్దుర మాపుము! మధురమైన
దివ్యచైతన్య భావము దేజరిలగ!
సర్వజీవుల నొకటిగా సర్వవిశ్వ
మంత యొక్కటి యనుచును మదిని దలపు!

గీ. సంజరేకలు దూర్పున సరసరీతి
విరిసినట్టుల విరియుము విమల ప్రభల!
మనసు మలినపు నలుపులు మాసిపోవ
రంగురంగుల వెలుగులు రాజిలంగ!

గీ. కుక్కురో కుక్కు రనుచును కోడి పిలుపు
వినుచు నిద్దుర లేలెమ్మ! విపులమైన!
కార్యభారము గలదుగా గలతలేక
నిర్వహింపగ రారమ్మ! నిదురమాని!

గీ. తూర్పుకొండను నల్లదె తొలఁచరించె
చేత చిని వెన్నముద్దగ చిన్నిముత్య
మట్లు దాపున పూచిన మల్లెయనగ
వేగుచుక్కదె యుదయించె వేడుకలర!

గీ. తూర్పు స్త్రీముఖమందున దోరముగను
నతిశయించిన శ్రీతిల్కమనగ నొప్పె!
వేద పనసలు జదువుచు విలసనముగ
కావ్యతల్లదె కలకల కదులుచుండె!

గీ. కావ్య దరుదెంచ కటిక చీకటులు చెదిరి
కదిలిపోవగ సాగెను కడలిదాగ!
కికిలి పిట్టల బలుకులు! ప్రీతివెలయ!
సన్న సన్నని బులిబుల్లి సవ్వడులను!

గీ. రెండు బారలు పైకెక్కి కొండ కొమ్ము
నందు నిలిచెను కావ్యుడు సందముగను!
కొలనినీటిని గలిపించె కోమలముగ
తెల్లకలువగ వికసించె నుల్లమలర!

గీ. కొలని లోపలి కావ్యుని కోర్కెదీర
క్రొత్త పువ్వేదో వికసించె కొలని నంచు!
రెక్కలను గొట్టి బాడుచుచు, ముక్కురాచి!
నీటిపక్షులు దిరిగెను చుట్టిముట్టి!

గీ. ఆవు లంబా యఱంచును నడలసాగె
దూడలంబేయటంచును దూలి బలుక!
గొల్లపడుచులు గవ్వాము లుల్లసిలగ
కదుప సాగిరి గాజులు ఘల్లుమనగ!

గీ. రాత్రియంతయు కలువల రమ్యరీతి
ప్రీతివెలయించి చంద్రుడు బీతివెలయు!
మఱల రాత్రికి వచ్చెద రమణులార!
యనుచు దెలిపెడునో యన యస్తమించె!

గీ. దూరమేగిన పతివైపు దాఱజూచి
కలువ భామలు వెలవెల కాంతితగ్గి!
ఒక్కటొకటిగ రేకల జిక్కబట్టి
ముసుగు దాల్చెను విరహము మోసులెత్త!

గీ. అదిగో! తూర్పున కుంకుమల్ యుబ్బరముగ
పంజరేకలు మబ్బులు సఖ్యమొంది!
చిత్రశాలగ నొప్పెను. శిలలపైని
శిల్పిజెక్కిన శిల్పముల్ నిలిచినట్లు!

గీ. పిల్లతెమ్మెరగాలులు చల్లగాను
పూలదీవెల గదిలించె బులకరింప!
గాలి కల్లల నాడుచు కమ్మనైన
పూలవాసన వికసించె బొలుపుమీర!

గీ. తుమ్మెదలు ఝుమ్ము ఝుమ్మని తూలి తూలి
నాట్యమాడగ సాగెను రమ్యముగను!
పూల పుప్పొడి ముఖమున బూసికొనుచు
మధుర మకరందమును ద్రావ మసలుచుండె!

గీ. బాలసూర్యుడు ప్రభవించి ప్రకృతి పటము
మార్పుజెందెను బంగరు మాలలోని!
పూలరజమును జల్లిన బొలుపు జూపె
దశదిశలుగాంచె రంగుల రాశిపొలుపు!

గీ. ప్రకృతి చైతన్య మొందెను బల్లవించె
యణువణువు నూత్న శోభల నినుమడించె!
అవిగో! యాలయ ఘంటలు నలరు శంఖ
నాదమల్లదె! వినుము వేవేగ లెమ్ము!

గీ. కార్యభారమదెంతయు గలదు నీకు
క్షణము దీరికలేదు సూ! కదులువేగ!
నీదు సహచరు లల్లదె నిలిచినారు!
జాగుసేయక బయనించు రయముమీద!

గీ. విశ్వమంతయు నీదెగా విమలమైన
దేశదేశాల ప్రజలు వే దిశలనున్న!
లోకజనులెల్ల నీ వారె రాకకొఱకు
వేచియున్నారు జూడుము వేగలెమ్ము!

గీ. కలిసి పని చేయవలయును కష్టములను
కలిసి యెదరింపవలయును కఠినమైన!
సమసమాజము సమతల మమతగోరి
యమృత ఫలమును నందగా నరుగవలయు!

గీ. ఎన్ని కష్టాలు వచ్చిన యెంతలేసి
యిడుములొచ్చిన రానిమ్ము సడలిపోక!
ముందుకడుగిడఁ లెనురా మోదమొప్ప!
వెనుక కడుగిడరాదుగా వెన్నుజూపి!

గీ. మంగళంబులు గూర్చగ మానవులకు!
విశ్వమానవ శ్రేయస్సు విమల లక్ష్య
సాధనమునకై సాగుము! సంఘశక్తి
పెంపు గూర్చగ యడుగిడు భీతిలేక!

గీ. ప్రకృతి యొడిలోని బిడ్డవు ప్రకృతి యందు
కష్టసుఖములు రెండును గలిసియుండు!
రాత్రిబవళులు శీతోష్ణ రమ్యలీల
నీకుగూడను వర్తించు నిర్మలముగ!

గీ. కష్టములగాంచి కన్నీట గష్టబడకు!
సుఖములవి వచ్చు గోరక సురుచిరముగ!
కాలచక్రమునందున గలిసియున్న
వానినెదిరింపనగునె? నీ వశమె? తరమె?

గీ. ధీరబుద్ధిని సమభావ ధీమతమున
కష్టసుఖముల రెండిట కలగిపోకు!
క్రుంగి పోవకు! మనసున పొంగి పోకు!
అంతరాత్మయె సాక్షిగా నలరుమోయి!

గీ. స్వేద మొలికెడి దేశము శ్రీలునిండు!
స్వేద మొలికెడి జాతులు సిరుల బొంగు
స్వేద మొలికెడి నరుడెగా శ్రేష్ఠుడగుట
గాంచుచున్నాము ధరణిని గధలగూడ!

గీ. ఎట్టి పనినైన నేమర కిట్టెజేయి!
బద్ధకముతోని నుండుట బాపమరయ!
మంచి చెడుగుల కార్యము నెంచిజేయ
లక్ష్మి స్వయముగ వరియించు లాలితముగ!

గీ. మఱువబోకుము! పెద్దల మహితచరిత
విడువబోకుము! బదువుడు విమలమతిని!
అనుసరింపుము వారిసె యమలచరిత
నీతి వర్తింప నదువుము నీతి యుక్తి

గీ. మాతృభాషను మఱువకు! మమత బెంచు!
ఎన్నిబాసల నేర్చిన నిదియె మొదలు!
కన్నతల్లిగ భావింప కల్పతరువు!
జన్మభూమిని మరువకు మదిసినెప్పుడు!

గీ. మధురగీతము బాడుము మంజులముగ
దేవదేవుని జింతింపు దివ్యపదము!
ప్రేమగీతము గొంతెత్తి ప్రీతిబలుకు!
సామగానమువలె శాంతి సర్వజగతి!

గీ. సంజవెలుగుల జివురులు సరసరీతి
కోయిలకు విందు బెట్టుము గూర్మిదనర!
కలిపి బాడుము కవివోలె కమ్మనైన
మధుర ఛందస్సులో పాట మాట పొదిగి!

గీ. పనియె దైవముగా మఱెఖలుకుమెపుడు
విధిని నిర్వహింపగవలె విసువులేక!
మంచి పనులందు దైవము మఱగియుండు
కర్మమూలము సర్వముగధకునేత!

గీ. అందమందున గలదు యానంద మంత!
సుందరత్వము సౌఖ్యము సుఖము గూడ
ఎచట శుచియును శుభ్రత యింపుగొలువు!
నచట నుండును అంద మానందములును!

గీ. పైనిజూడకు మెఱుగుల పసరుధనము
లోని మనసును గాంచుము లోకమందు!
అందమంతయు లోనుండు నదియె గోరి
కొనుము! నర్చించి పర్పింపు! మనసుదీర!

గీ. అందమది శాశ్వతముగాదు నఖిలమంత
రెండురోజుల ముచ్చట! ఒండిదాలి
పోవు నాకు చందము వినుము బోవునంత!
మనసు మాత్రము వెలుగొందు మహిమజెదక!

గీ. సృష్టిలో ప్రతి వస్తువు మట్టియందు
గలియుననను మాట మదియందు దలపుమెపుడు!
శాశ్వతముగాదు నందమె చరితయందు!
నడుగు జారనిదేది యీ పుడమి యందు?

గీ. అయిన గూడను మానవుడాత్మ దెలివి
అందముల నెపుడు గూర్చుచు నలసిపోక!
మార్పులోపల గలదు నా సుఖము సౌఖ్య
మంద మానందముల బొందు మనిషి బ్రతుకు!

గీ. అందమన నగ గూర్చిన కుందనంపు
బొమ్మ కాదుగా! మనసున కమ్మనైన!
తేనె చినుకుల యనురాగ తీపినిచ్చి
కలిసి పయనించు నందాల కాంతగాని!

గీ. సుఖమనగ తిని త్రాగుట సుదలిశేరి
సోలిపోవుట కాదుగా సౌఖ్యలీల!
మనిషి బ్రతుకున కర్థంబు మహిని దెలిపి
యున్నతోన్నత పథముల కురుకు లిడుట!

గీ. కలిసి పయనించు జీవించు కాంతనంది!
మనసు నచ్చిన మగవాని మగువ పొంది!
ఇరుగు పొరుగును దనవారి కింపొనర్చు
నదియె దాంపత్య జీవన మంత్రము ధరణి!

గీ. దేశమాతను బూజించు ధీరమతుల
పరులమేలును గోరుచు బాటుపడెడి!
అట్టివారిని బూజింపు నాత్మనలరి
యడుగు జాడలబయనింపు యంజలులను!

గీ. నీతితెరజాపగా జేసి ప్రీతిమెరయ!
శీలమన్నది చుక్కానిజేరి నిలిచి!
జీవితంబను నౌకను జేరనిమ్ము!
గమ్యమేదియొ తీరము గమ్యమునకు!

గీ. పుడమి యాకాశమందున బొలుపుగనుచు
నబ్బురమునందబోకుము! నతిశయముగ!
సహజమౌ శాస్త్ర దృష్టిని జతను జేసి
తెలిసికొనుమోయి ప్రశ్నల జతురమతుల!

గీ. గురువు బోధించు విషయము గుర్తునుంచు
కొని మది బులకించుచు మథనబడుచు!
నిర్మలోదక సరసిలో నిలిచియుండు
బద్మమట్టులబాసిల్లు పరమగతిని!

గీ. దేవదానవు లమృతంపు దీప్తికొఱకు
పాలసంద్రము దఱచెడి భంగి నీవు!
అభ్యసించెడి విద్యకై యనవరతము
బూన్కిబూనుము బొందుగా బూర్ణముగను!

గీ. దేవతల మేలుగోరుచు ధీరమతిని
హరుని మంటల కన్నుల కాహుతైన
మరుని పోలిక నీవును మమత సమత
మహిని స్థాపింపగోరుచు మాసిపొమ్ము!

గీ. అవని లోపల జేసెడి యఖిల కర్మ
లకును మూలమొక్కటి యగు లాలితముగ!
అదియె యానందమంచును నలరిబల్కు
చుండ వినలేద ప్రాజ్ఞులు సుందరముగ?

గీ. సత్యమానందములు రెండు నిత్యముగను
బొమ్మ బొరుసులవలె నుండు నిమ్ముగాను
వేఱువేఱుగ జూడకు విమలమైన
యాపరంజ్యోతి యని మది యరసిజూడు!

గీ, ఎచట ధర్మము నిలుచునో యచట జయము!
గలిగి యుండును నిజమిది కల్లగాదు!
ఎట్టి గ్రంథమునైనను నెట్టి కథను
దెఱచి జూచిన విన్నను దెలియు నిజము!

గీ. హింసబెంపకు బాపము! హింసవంటి
యాత్మ నాశము జేయకు నహముదోడ!
ప్రేమ యనురాగ బీజముల్ ప్రేమ నాటి
సోదరత్వము బెంపుము సాదరమున!

గీ. మంచి మాటల బలుకుము! మహిని యెపుడు
పెద్దచిన్నల యందున ప్రేమ జిలికి!
నీతి దప్పిన మాటలు ఖ్యాతిబోవు
బాటులొచ్చును జీవితకు భంగపాటు!

గీ. మనసు మాటను మర్మము మాయలేక
విప్పిజెప్పుము నున్నట్లు విమలగతిని!
మనసు మాటను దాచుచు మాయజేయ!
కాలగతి నిన్ను గలతల గాలదన్ను!

గీ. విమల సౌశీల్యములబెంచు విమలబుద్ధి
కష్టముల నన్ని గడతేరి యిష్టసుఖము!
లన్నిబొందెదు మనసార మన్ననలను
విచ్చు కత్తులలోనుండి విడివడి మణి!

గీ. కన్నతల్లిని బూజించు గౌరవమున
ఎన్నికష్టాల నినుబెంచి యున్నదంత!
నీకు నర్పించి తనివార నీతినేర్పి
దీవెనిచ్చెడి తల్లికి దీటుగలదె?

గీ. తెల్లవారగ నినులేపి యుల్లమలర
తీపిమాటల ముద్దుల తేనెలొలికి!
చద్దియన్నము బెరుగుతో ముద్దనోటి
కందజేసెడి తల్లికి గలదెసాటి?

గీ. ఆటలాడుచు బరువిడి యటునిటుపడి
ధూళియంటగ నంతయు దులిపి ప్రేమ!
చంకనెత్తుక తనివార వంతదీర్చి
ముద్దులాడెడి తల్లికి మోకరిల్లు!

గీ. మంచి స్నేహితు డెప్పుడు మమత అంచు
ప్రేమ సౌహార్ద్రభావము ప్రీతి చిందు!
కష్టసుఖముల యందున గలిసియుండు!
చెడును వారించు నిరసించు జేయు మంచి!

గీ. వట్టి మాటలు బలుకుచు వగలుపోయి
యుట్టి బోవకు నాకేమి బట్టె ననుచు!
గట్టిమేలును జేయుము గలుగు ప్రేమ!
వట్టి మాటల వలనేమి వనరుమేలు?

గీ. పరుల కలిమికి జింతించి బాధబడకు
నొరుల సుఖముల నీసుతో నొఱగిపోకు!
ఉన్నదానితో దృప్తితో జెన్ను మిగిలి
అనుభవింపుము శాంతిని యాత్మదృప్తి!

గీ. అందగాడ నటంచును నతిశయముగ
సుందరాంగుడ నంచును సోలిపోకు!
పొంచ భౌతికమైనది! హంసయుండు
నంతవఱకును మాత్రమే మంతిమాట!

గీ. స్త్రీల నవమాన బరుపకు, శీలవతుల
కంటనీటిని దెప్పించి కలతదేకు!
మరణమును దెచ్చుకున్నట్లె మంటలందు
సమిధగా యాహుతైనట్లు సరిగ వినుము!

గీ. కలిమి బరులకు జూపుచు గష్టపడకు!
బలముగలదని బొంగకు! బల్లిదులను!
అల్పబుద్ధిని జూడకు! నట్టులైన
మానభంగము నొందుదు రధికులైన!

గీ. నేతనంచును నిలబడి నీతిదప్పి
చెడ్డదారుల వర్తిల్లి చెడుగుసేయ!
మాట దప్పినవాడంచు మహిని జనులు
గేలిసేయుచు నుందురు గీతగిసి!

గీ. సూక్తి సుధయందు దేలుము నురుచిరముగ
మనసు చీకటి మాపును మానితముగ!
వెలుగునిచ్చును! మాటలు వేయనేల?
ఆత్మ బరమాత్మ జేరగ యదియె దారి!

గీ. మొక్కనాటిన ఫలమేమి మోదమలర!
నీరుపోయంగ వలయును నిలిపి దాని!
రక్షసేయంగ వలయును రాజదెట్లో
ధర్మ రక్షణ సేయునో ధరణి యందు!

గీ. చెట్టు జేమల బూజింపు శివునిగాగ
మనదు సామీప్యమున నుండు మహిని దేవ
తలుగ కోరిన ఫల పుష్పములను నిచ్చు
కనుల ముందఱ గోర్కెల గాంక్ష నిచ్చు!

గీ. తల్లి దండ్రులు ప్రేమను వెల్లినిరియ
తమదు సంతాన సుఖముకై దాచిపెడుదు!
కలిమి భోగభాగ్యములను జాలగలుగ!
ఖర్చుసేయంగ వలయును ధర్మదృష్టి!

గీ. చదివినది విస్తృతంతయు వగిసి పథము
గాను యోచింపవలయును గదపి బుద్ధి!
అట్లు చేయుగా జాలని యల్పమతులు
ఎట్లు విజ్ఞాన శిఖరము నెక్కగలరు?

గీ. మంచి విషయము జదివిన మనసునందు
శిలలపై యక్షరంబులు సేయువలయు!
సుందరంబగు భావము సుచిరముగ
శిల్పముల జేయు మదియుండు చిత్రరీతి!

గీ. మనసు పూదోట మాదిరన్నట్లు మార్చుకొనుము!
రంగు రంగుల పూలతో రమ్యమైన
అందముల గూర్చుకొను జిన్ని! యందు నింపు
పరిమళంబుల వెదజల్లు భవ్యరీతి!

గీ. రంగు రంగుల బొమ్మలు రమ్యమైన
చిత్రశాలగ నీమది దీర్చుకొనుము!
అందమంతయు నీమది యలరునట్లు
దివ్యరాగాల భావాల దీపమట్లు!

గీ. కవికి దోచెడి భావాల కవనమట్లు!
తీయ తీయని పదములు దేనెలొలుకు!
విధము మధురమా భావాలు వేనవేలు
నిలుపు నీమది యందున నిత్యతలగ!

గీ. తిమిరమందున జ్ఞానము తేజమలరె!
కష్టములయందు గనుమోయి! రమ్యమైన
సుఖము నానందముల వలె సురుచిరముగ
ధైర్యమును వీడకెప్పుడును దైన్యమునను!

గీ. ఎన్నిగ్రహములు చుక్కలు నెంతలేని
పాలపుంతలు విహరించు వేడుకలర!
అట్టి నింగెకివలె నీవు సంబరమున
విషయములనన్ని భరియింపు వేడుకలర!

గీ. తప్పుజేసిన వారిని పగను బిల్చి
మంచిమాటను మాటాడి మనసు దఱచు
టెంత సంతోష విషయము వింత మంత
సంతసముగ మారిపోవును సలలతముగ!

గీ. చిన్నపని యందుగూడను జిత్తమలర
మనసు నిలుపుము! జేయగ మసులుబాటు!
చేయబోకుము! నది నీకు జేటుదెచ్చు
చిన్నతప్పులె పెద్దవై పెఱచునంత!

గీ. సంతసమునను నెపుడును గంతులేయ
వలయు పాలబుగ్గల పసిపాప వోలె!
ఎట్టికార్యమునైనను నిష్ఠజేయు
కార్యదక్షత వలయును గలతలేక!

గీ. తిండి తినవోయి దండిగ కండగలుగ
కండగలవాడె మనిషని కమ్మనైన!
గీతిలో బాడె గురజాడ నీతివినుము!
పరులమేలుకు గృషిచేయ బలము వలయు!

గీ. అర్భకుడవైన నీవేమి యరసిచేయ
గలవు మంచిని పరులకు కష్టసుఖము
లందు బాలుపంచుకొని యెదవు లాలితముగ?
గాన బలమును స్థిరమును గలిగియుండు!

గీ. దేహబలమును స్వాస్థ్యము దివ్యతేజ
ములను గలిగియుండుము జిన్ని! మోహమేల!
ఆత్మయందున నివసించు హరి శివాత్మ
దేహమును జింతజేయుము దేవళముగ!

గీ. ఆత్మ పరమాత్మ యందున యంశమనుచు
దెలిసికొనవోయి! దేహము దివ్యజ్యోతి
వెలుగునివసించు స్థలముగ వేడుకలర!
అట్టిదేహము నిర్మించు నందముగను!

గీ చెడును దూరము జేయుము జెడ్డమార్గ
ములను దొలగుచు మనసును మలుపు ద్రిప్పి
మంచిదారిని నడుపగ మలచికొనుము!
దేహమును యొక కోవెల జేయుజిన్ని!

గీ. గత చరిత్రను జతుపుట కల్లలైన
గొప్పజెప్పి కొనుటకును గొల్లసుద్దు
లట్లు పాటబాడుటకాదు! నరసిజూచి!
మంచి చెడ్డల మధియింపు మర్మముగను!

గీ. గతచరిత్రను గలిగిన కమ్మనైన
మంచితనమును గ్రహియింపు మానితముగ!
చెడును ద్రోయుము నావల చింతలేక
మనది యైనంత మాత్రాన మంచిదగునె?

గీ. జయపరాజయ చైతన్య జాగృతులను
కష్టసుఖములు గన్నిళ్ళు గలత నలత!
సుఖము సౌభాగ్యములనన్ని చింతజేసి
తెలిసికొను జిన్ని! చరితను విలసితముగ!

గీ. ఐకమత్యము క్షీణించి యమిత స్వార్థ
మునను వర్తించినపుడును, మోసముననుǃ
అంతరంగిక కలహాల నలమటించి
నప్పుడు దేశము జీకటి నాక్రమాడె!

గీ. అందరొకటను భావము నంతరించి
నేను నాయను భావము నింగి పెరిగి!
ప్రాంత కులతత్త్వ మతతత్త్వ చింత లావ
రించినయపుడు దేశము వంచబడియె!

గీ. గాన యందఱు నొకటను కమ్మనైన
భావమును మది యందున బదిలపఱుపు!
భారతీయులు మనమంత భరతజాతి
మనది భారతదేశము మాతృభూమి!

గీ. అంతియే కాదు సూ జిన్ని! యఖిల వసుధ
ఒక్కఖండమె! ప్రజలంత యొక్కధరణి
పుట్టినట్టి మానవులుగ బులకరించి
యలదురాత్మీయ తత్త్వము నఖిల జగతి!

గీ. ఎచట యేదేశమందున యెట్టి విపద
వచ్చినను గూడ స్మరియింపు నచ్చముగను!
నీదు ప్రజలకు గల్గినయట్లు నిలచి
బాధ దొలగింపు బూనుము బాంధవులుగ!

గీ. పంచ శీలను దలపుము! పరమలక్ష్య
మునను వర్తింపు చుండుము! మోదముననుǃ
ఇరుగు పొరుగుల వారల నింపు మీర
గౌరవింపుము గమ్మని కాంక్షపరియు!

గీ. పరుల ధనమును గోరకు! ఒరుల సొత్తు
నాక్రమింపకు! నద్దియె విక్రమించి
తగువుగా మారు నింకను దరతరాలు
ఆరదీజ్వాల యార్పిన యారదెపుడు!

గీ. మంచినెపుడును మరువకు! మంచిజేయు
మనుజు నెప్పుడు మరువకు! మమత దీర!
గారవింపుము! గన్నుల జేర్చికొనుము!
హృదయమందున జెరగని ముద్రవేయు!

గీ. శుభము గాంక్షించు ముందుము సోదరులకు!
మంచినెపుడును గాంక్షించు మానవులకు!
సకలజీవుల గాంక్షించు సపములముగ
సుఖము సౌభాగ్యములు గలుగ సుధుచిరముగ!

గీ. నాల్క నర్తింప జేయకు! నాల్గుదిశల!
కఠినములు బల్కి కలతల గలుగజేయ!
ఉచిత భాషణసేయుము నుర్విమెచ్చ
పలుకుబంగారమును మాట పల్లవింప!

గీ. ఉదయ సంధ్యల జూడగ సదయ హృదయ!
మఱువ కెప్పుడును నుపయించు మధురమైన
మధురభావాలు, రాగాలు సంచితముగ
పూవులై వికసించును పొలుపుజింది!

గీ. పరుల సుఖదుఃఖములయందు బల్లవించు
హృదయమది దేవదేవుని దివ్యమంది
రమని దలపుము! భావింప రమ్యమైన
జీవనది యని, జనులకు జీవమిచ్చు!

గీ. దేశ సేవను జేయగ దీక్షయేని
యడుగు ముందుకు వేయుము నాశలేని
జీవితము జేత జాతికి సేవజేయ
అంకితము గమ్ము యారని యాత్మశక్తి

గీ. మనిషి బ్రతుకును భాసింపుమల్లె దీవె
పూలతావుల వెదజల్లి పుడమినంత
కమ్మదనమును గలిగించు గాన నీవు
మంచి తనమును వర్షించు మధురముగను!

గీ. మనిషి బ్రతుకును భాసింపు మావి గొమ్మ
మధుర ఫలముల నదించు మానవులకు
పరులమేలుకు గృషిచేయు ప్రాజ్ఞుడెపుడు
పరుల యాచింప డెపుడును పరులకిచ్చు!

గీ. శీలమున మంచినడవడి వెడుగులేని
మంచి దారిని నడుచుట మర్మముగను
మంచి చేయుట పరులకు నంచితముగ
పరుల బాధింపకుండుట యంచితముగ!

గీ. కీర్తి సౌధము లాశించి యార్తిచెంది
యలమటింపకు దానికై యలత చింది
ఎండమావులవంటివి! పండి రాలు
యాకువంటిది యని నమ్ము! నాత్మయందు!

గీ. దేవుడెచ్చటో గలడంచు దివిని భువిని
వెదుక లోకుము వేదన వెంట జిందు
ముందు వెనుకల ప్రక్కల నిందునందు
గలడు సూ! ఆత్మయందును గలడు! గలడు!

గీ. ఒక్కఁడె దేవదేవుడు నిక్కముగను
అట్టి యీశుని జనులంత నాత్మ నలరి!
వివిధ నామములను బెట్టి యెంత వింత
రూపములతోని బూజింత్రు రూఢిమెరయ!

గీ. గమన మొక్కటి యందఱి గమ్యమొకటె
వేరువేరుగ బయనింత్రు దీరమునకు!
అదియె సత్యము నదె ప్రేమ! నదియె శాంతి!
మానవత్వము దొలికెడి మధుర జ్యోతి!

గీ. ప్రేమ భావము దొలుకును ప్రీతిమెఱయ
కరుణభావము జూపుము! గాంతివిరియ
నీలొయున్నట్టి జ్యోతిని నిర్మలముగ
జూడయత్నింపు! గనిపించు నీడలతని!

గీ. మనసు మాలిన్యములనన్ని మాపికొనుము!
కనక రేఖల గాంచగ కలల గనుము
దివ్య యుత్సాహమున నెపుడు దీప్తిజెందు
కర్మపథమున జరియింపు గాంతి జింద!

గీ వీరగాథలు జిత్రించి విమలమైన
మానవత్వము వెలయించి మంచి బెంచి!
మట్టి యందున మాణిక్య మిట్టిజేయు
కవుల ఋణమును దీర్పగా గలదెదాం?

గీ. ఈసు జూపకు! నితరుల వాసిగాంచి
పరుల కలిమిని యీర్ష్యను గలత బొంది!
కుళ్ళిపోకుము! నేడ్వకు కుళ్ళి కుళ్ళి!
వదులుమా! యీసు మనసున వన్నెలొలుక!

గీ. ఆశతోడుత నాకాశ మందు బోకు
చుక్కఁ జన్నియు దెమ్మని చిక్కిపోకు!
ఆశ దగదు హా! యణప్రము నందినంత
మనకె సుఖమును బొందుము పరల దృష్టి!

గీ. పదవి గర్వించు మనసున బల్లవించి
దాచి పెట్టకు సవనీతి హాయగందు!
నిండుకుండగ నున్నచో నిండు బ్రతుకు!
అమిత హాసిను గలదంత నుడిగిపోవు!

గీ. నీతిదప్పియు న వసతి పతిని నడువ
వేలు జూపుదు ర వడు శీలమంత
చెడి పవాసిగ చంటురు జెడ్డనంచె!
మీద వేయుదు రంపణు మే మోడి!

గీ. తనకు గలవంత ప్రజలకు పన్మయముగ
మర్పణము సేయువాడె సూ! యమృతమయుడు!
ప్రజలసేవకు బూనిన ప్రగతి శీలు
డతడె దేశభక్తుడనంగ కీర్తిగాంచు!

గీ. ఉకలిని గొన్నవానిల యూదరించి
అన్నమును బెట్టువాడె సూ యాత్మవిభుడు!
అదియె మాధవసేవగా నాత్మ దలచి
దీన జనులను గాపాడు ధన్యుడగుచు!

గీ. కంటనీటిని దొలుకకు! గుణము బడకు!
ఆపదలు జుట్టుముట్టగా నలిసిపోకు!
వీరధర్మము బాటించు విస్తృతముగ
మానవత్వము మదియందు మానిపోకు!

గీ. మార్గమిది నీది కఠినము మందమతులు
స్వార్థపరులును పోలేరు సాహసమున!
రక్తధారలు భూమిని రంగవల్లు
లనగ చిత్రింపవలయును ధీరముక్తి!

గీ. పట్టువిడనాడ బోకుము! బట్టినట్టి
పట్టు మేరుపు కొండగ బరగ నీవు!
లక్ష్యములు నాట్యమాడగా లాలితముగ
కోర్కెలన్నియు నీ ముందు గొలువుదీర!

గీ. అహము విడిచిన జాలును సంచితముగ
సకలమును పొందగలిగెదు స్థావరముగ!
మిత్రులగుదురు నందఱు మేదినియును
శిరము వంచును సంపదల్ జేరవచ్చు!

గీ. పదవి పొందగ దలపకు బహుళమైన
స్వేచ్ఛ పోగొట్టు కొందువు నిచ్చగోరి!
ధనము బోగొట్టు కొందువు ధర్మమంత!
శీల మంతయు బోవును శీఘ్రముగను!

గీ. కవులు వ్రాసిన కవితలు కదుపు జనుల
మధుర భావాలు మనసున మర్మముగను!
మోసులెత్తగ జేయును ముదము జింద!
అంబరంబున విహరింప యాశ గూర్చు!

గీ. ఉన్నతములైన కార్యములుర్వి జేయ
కవిత బోధించుచుండును గర్మగతిని!
వీరులను జేయు త్యాగుల విలసితముగ!
వీరనారుల సృజియించు వింతగాదు!

గీ. జీవితమునందు గావలె దివ్యమైన
మధుర యాదర్శములు మఱి మంచిలక్ష్య
ములును వలయును లేనిచో మొదలులేని
కథకువలె నర్థరహితుడై కాంతిలేక!

గీ. పడవ బయనింపజేయుచు, బరగ జూపు
మార్గమది యేమొ! చుక్కాని మధురముగను
మనిషి కటువలె గావలె మార్గదర్శి
యైన యాశయమెద్దియో యనుసరింప!

గీ. అలల సుడులను జిక్కుచు నలసిపోవు
పట్టి నరునికివలె నీవు నలిగి పోకు!
ఆశయములును, లక్ష్యము లలరియున్న
అలల సుడులను దిరుగవు నలసిపోవు!

గీ కోపమును నిల్పుకొన మది తాపమునను
తన్నుదా దహించుకొనుచు నిన్నుగూడ!
కాల్చి భస్మము జేయును గరుణలేక!
అగ్నియని నమ్ము కోపము నణచు మెపుడు!

గీ. తామసము దాను మసిజేయు దననుగాచు
ననెడి లోకోక్తి వినలేద? కనగలేవ?
కోపమనియెడి శత్రువు బారద్రోలి
కొలని కలువగ నుండుము! విలసితముగ!

గీ. తప్పుజేసియు నొప్పుగా దలచి దలచి
యొప్పుగా జేసి జూపకు ముప్పువచ్చు!
ఒప్పుకొను జిన్ని! జేసిన తప్పులన్ని!
చిత్తశుద్ధిని బ్రకటించు నుత్తమముగ!

గీ. చేయు ప్రతిపని గూడను జెంతనుండు
నీశ్వరునకంచు మది యందు నింతగూడ
స్వార్థమది లేక జేయుము సర్వమాది
దేవునకు నంచు నర్పణ మలరి నమ్మి!

గీ. ఇంతనంతకు బేయకు! నింత జేసి
అంతగొప్పలు జెప్పకు! అంత జేసి!
ఇంతయని జెప్ప మంచిది! యంత నిన్ను
ఎంతో గౌరవింతురు సుంత వింత లేక!

గీ. దేవదేవుని జింతించు దినము దినము!
కోర్కెలను గోరబోకుము గొండలంత!
లోకశాంతిని గోరుము లోకజనుల
సుఖము సౌభాగ్యములగోరు సురుచిరముగ!

గీ. మంచి యాలోచనలను జేయు మనసునందు
తీయతీయని మధురమౌ తీపికలలు!
అవియె యరుదెంచు సత్యమై యఖిల జనుల
కనులముందట నిలుచును కాంక్షదీర!

గీ. ఎంత జదివిన గూడను నేమిలాభ?
మెంత విజ్ఞాన ముండిన యేమిఫలము?
మనసు మాధుర్యములు లేని మమత లేని
మనిషి యెందుకు దండుగ మరఫిరంగి!

గీ. త్యాగమున నుద్భవించును ద్యాగఫలము
జేతికందును మనసార ప్రీతి జింది!
త్యాగమది జేయకుండగ త్వరితగతిని
ఫలము దానుగా వచ్చునె? బర్వులెత్తి!

గీ. నిఖిలమంతయు జూచెదు నిక్కి నిక్కి
నీవు నీలోన జూడవు! నిర్మలముగ!
నీదు తప్పొప్పులను జూడు! నీతిదప్పు
బాటనడువకు! బరికింపు! పాపమనసు!

గీ. ఆత్మ గౌరవ మొక్కటే సఫలజేయు
మనిషి బ్రతుకును బ్రతుకుగా మహిమగలుగ!
ఆత్మగౌరవ మెపుడును పారబోసి
పరుల యాధీనమై లొంగి బ్రదుకబోదు!

గీ. ఆత్మగౌరవమును లేని యట్టి వ్యక్తి
అందఱినిగూడ దాసులె యాత్మదలచు!
అందుకే జిన్ని! వ్యక్తిత్వ మతిశయింప
స్వేచ్ఛగా మాటలాడుము! శిరమునెత్తి!

గీ. ఇతరులకు లొంగి ధనముకై యిచ్చకాల
నన్ని సహియింప బోకుము! నీకు చెడ్డ
పనుల నాచరింపకుమయ్య పతనమొంది
మఱలి రాలేవు గమనింపు! వ్యక్తిత్వమంతరిలప!

గీ. మంచి చెడ్డలు దెలిసిన మానవుని
యెవరు వంచింప జాలరు నీసడించి!
కొండ నెవ్వరు బద్దద్రోసి కులుకఁజూప
గలుగు వారెవ్వరుందురు నిలను నిలిచి?

గీ. నిందజేయకు మితరుల నీసడించి
లేనిపోనివి గల్పించి లీలగాను
కల్లకపటము బయలగు యెల్లినేడు
బయటబడునంత కపటము బట్టబయలు!

గీ. మంచు మయముగ భూమంత మారిపోవ
పంటలన్నియు పండుచు పల్లవింప!
ప్రకృతి సంతోషమును పొంగి బహువులెత్త
నిర్జనంబున భజియింపు నిర్మలముగ!

గీ. ఆకురాలెడి కాలము నష్టైపోగ
సృష్టియంతయు నింతెగా సృజనమంత!
ఇంతేయను భావమొక్కటి సంతసమున
మదిని నింపగ మాధవు మనసు నిలుపు!

గీ. రంగురంగుల మయమిది రమ్యమైన
భూమి! మారుచు మనలను మురిపించు!
కోటికోటి యందములను చాటుచుండు!
నమ్ముమిది జగదీశ్వరుడు నాట్యమనుచు!

గీ. కష్ట సుఖములు గలిసియు కలిసితేము
ఆటలాడును నరునితో నలత లేక!
మనిషి కలగిండు బడిపోవు మారిపోవు
అన్ని తెలిసియు కలతను నలిసిపోవు!

గీ అందుకే నీవు నేకాంతమందు నిలిచి
నిర్జనము నందు ప్రార్థింపు నిర్మలముగ!
మరల జన్మములేనట్టి మధుర వాంఛ!
నిచ్చిగాపాడుమని కోరునింపుమిర!

గీ. జీవితంబన సుఖమయ తావిగాదు!
కష్ట సుఖములతోడను గలిగియుండు!
అటులె సంభ్రమము గూడను నలల తెరల
గూడియుండు జీవితమిట్లు గూర్మిధ్వనుల!

పూలు వికసించు దావులు దొలుకుచోట
పుప్పొడులు రాలి భూమంత బులకరించు!
చోట వసియింపు మింపుగ బాట యదియె!
దేవదేవుని నందగ భావమున్న!

గీ. కొండకోనల కోకిల గూయుచోట
దూరముగ నొక సెలయేఱు దూకుచోట!
అలల ధ్వనులను సచ్చరల్ నాడుచోటు!
ధ్యానమున బల్లవింపుము భావజగతి!

గీ. రంగురంగుల సంధ్యలు రమ్యమైన
చిత్రశాలగ రంజిల్ల చిన్నిచిన్ని
మబ్బు లల్లన వచ్చిటు మాటలాడ!
మనసు నిలుపుము! మాధవు మధురమూర్తి!

గీ. మండుటెండల కాలము మాసిపోయి
నింగి తొలి మేఘములు గ్రమ్మ సంగతిగను!
మెఱుము లుఱుములు తొలివాన గురియు వేళ
అంతరంగము భజియించు నాత్మవిభుని!

గీ. చిలుకలన్నియు గుమిగూడి చిత్రమైన
కథలు జెప్పెడి తావులకావ్యరీతి!
కలకలంబని వాగులు గదులుచోట
పార్వతీ పతి భజయింపు భక్తిమీర!

గీ. నవవసంతము నరుదెంచి నవ్యమైన
భావరాగముల్ తాళముల్ భవ్యగీత!
లందియిచ్చెడి శుభవేళ యాత్మవిభుని
మానసమునందు భజియింపు మంజులముగ!

గ్రీష్మతాపము వినువీధి మోసులెత్త
మండుటెండల తాపము మహిని జీవ
కోటికంతకు మోహము వాటిలంగ
మల్లెమొల్లల నర్పింపు మాధవునకి!

గీ. వర్ష ఋతువొచ్చి వానలు కురియు వేళ
ఇంద్ర ధనుసులు నింగిని ఝుముడు వేళ
వనమయూరము నృత్యము వసరు వేళ
మదిని శివునిల్పి కొలువుము మఱల మఱల!

గీ. చంద్రకాంతులు విరియగ చారుసుంద
రములు ప్రకృతి యంతయు రమ్యమైన
కలువ తామర పూవులు కాంతులీను
అట్టి కొలకుల ధ్యానింపు నాత్మవిభుని!

గీ. గొప్ప దలవకు నే నని మదిని గోర్కె
విప్పిజెప్పకు బరులకు వేడుకగను
నవ్విపోదురు జనములు నివ్వటిలగ
అహము జెంతకు రానీకు నిహము జెడును!

గీ. సహనమనునది సంస్కృతి సరసరీతి!
మెరులు జేసిన జెడుగుల నోర్చుకొనగ!
మంచిగలుగును ఫలితము మానితముగ
వైరిమనసును జిగురించి పల్లవించు!

గీ. కవులు జెప్పిన చినిచిన్ని కథలనన్ని
నీతిపంతములైనట్టి కాంతు లందు
పాటలను బాడుకొను మది బరవశించి
తాళలయ రాగములు జింద దన్మయముగ!

గీ. పూలమొక్కలు పెంచుము పొలుపుగాను
పెరటి యందున దాపున ప్రీతిచింద!
నీరువోయుమురోజును నేర్పుగాను!
పూలుపూయుగ మొక్కలు పులకరించి!

గీ. అలరిపూలను గోయుము అమ్మపూజ
కొఱకు మాలను గట్టుగ కూర్మిదనర!
కాగితపు పూవులంచును గలవు నికను!
తావిలేదంచు గోయకే దడయబోక!

గీ. కొన్ని పూవులు వాసనల్ చిన్నినవ్వు
తోడ పులకించు వాసని దోసిలందు
చిన్నగా బట్టుకొను చిన్న! తేలిపోవు
గాలి విసురుకు బైపైని తేలిపోవు

గీ. పట్టునైనవి, పచ్చవి, పిట్టపూలు!
వాసనలులేని గన్నేరు వన్నెలేని
గడ్డిపూలు కాగితపు పూలు కలువపూలు
అన్ని గొనిపోయి యమ్మకు నందియిమ్ము!

గీ. అమ్మ గట్టును చూచంద యన్నిపూలు!
వరుస క్రమమున పూలను పన్నలోలుక!
మాలగా గట్టి యిచ్చును మధురముగను!
భరతమాతకు వేయుము భక్తిమీర!

గీ. జాతిమత భేదములులేని సత్యమైన
సమసమాజము నిర్మించి సమత మమత
వెల్లివిరియుగ ప్రజలంత వేడుకలర
సుఖము సౌభాగ్యములనుంత సురుచిరముగ!

గీ. దేశమాతకు పూదండ దీక్షవేసి
భక్తి భావము దొరలగా భవ్యమైన
ప్రతిన జేయుము భావిని భవ్యభార
తమును నిర్మింతు ననుచును తన్మయముగ!

గీ. బడికి వేళకు జనుచుండు ప్రతిదినంబు!
ప్రార్థనలయందు బాల్గొను భవ్యముగను
అన్ని విషయములందును నలరిశ్రద్ధ
అయ్యవారల పూజింపు నధికభక్తి!

గీ. వినయమున బ్రశ్నలడుగుము వేడుకలర!
చెప్పినవి వ్రాసికొను మది చెఱగని లిపి!
వినయముండిన వచ్చును విద్యయంత
భక్తియుండిన గనవచ్చు పరమపదము!

గీ. చదువుటయె కాదు! కాదుసూ! చక్కనైన
వ్రాతగూడను నలవాటు బ్రీతిమీర
జేసికొనుమయ్య! ముత్యాలు జేర్చినటుల!
తోటిబాలురు మెచ్చగ పోటిలేక!

గీ. ఇంటిపని చేయుటను గూడ వేడుకగను!
అలరి మానకు! నొకరోజు నలసతలను!
అయ్యవారలు బొగడగ యన్ని విషయ
ములను బ్రథముడవై యుండు ముదము మీర!

గీ. ఆట పాటల యందున మేటి వగుచు
చక్కదనమొప్పు సంగీత ఫణితి దెలిసి!
పద్య పఠనమునందును బ్రగతినంది
మెప్పునందుము నందఱుజెప్పికొనగ

గీ. మాతృభక్తి గీతములను మఱికొన్ని
దేశభక్తి గీతములను దీక్షతోని!
నేర్చి పెద్దలముందఱ నిలిచిపాడ!
మెచ్చుకొందురు కీర్తింత్రు మేలటంచు!

గీ. ఆటలందున జడియకు నడుగు వెనుక
వేయబోకుము ముందడుగు వేయివోయి!
దేహ పంశ్రమ యందున తీయనైన
హాయి జనియించు నాటలు హాయిగాదె!

గీ. ఆటలందున గలుగును నైకమత్య
మందఱము నొక్కటను భావముదయమంది!
అన్నదమ్ముల రీతిగా నలరుచుంద్రు!
అలలవలె పోరు సలుపుచు యగురొకటి!

గీ. వరుసక్రమ శిక్షణను నుండి వాసిగాంచు!
మంచి బాలుడ వనుచును మధురముగను!
ఇంటి పేరుకు యూరికి కంటి పాప
వగుచు బాలశాలకు కీర్తివన్నె తెమ్ము!

గీ. భావిజీవితమందున భరతప్రజకు
సేవజేయుము జిరతర శ్రీలు జింద!
సమత మమతల సిద్ధికై సహజమైన
క్రొత్తమొలకెత్త కోరికల్ కొనలుసాగ!

—★—

# వీధి గాయకుడు

## (కావ్యఖండిక)

గీ. పడప పాటగ బ్రతుకును బరువులాగు
ఎత్తుపల్లములెన్నియో హత్తుకున్న
ఎన్నికష్టాలు ముంచెత్తి వచ్చెనాయ!
పథము దప్పకు! వేగము! సదనమునకు!

గీ. కిన్నెరను మీటి కీర్తన సున్నితముగ
మాతృదేశపు దివ్యత్వ మహిమ జాటు
అల హిమగిరియు కన్యాకుమారులందు
ప్రతిధ్వనింపగ నీ పాట పరుగులెత్త!

గీ బిచ్చగానిగ వీధుల బిచ్చమెత్తు
కొనిన దప్పేమి? యొప్పేమి? కొండకోన!
లందు బాడుచు గోకిల నందు నిందు!
బిచ్చమెత్తదా? తరులను బచ్చిచివురు?

గీ. పారు సెలయేటి జలముల జేరి కోకి
కుహూ కుహూ కుహూ నంచును కోమలముగ!
పాట బాడుచు యాచించు దోసిలొగ్గి
దప్పిదీరగ ద్రావును దయనుగోరి!

గీ. మావితరువును జేజాచు మధురమైన
చివురు బువ్వుల యాచించు చిత్రముగను
గొంతు సవరించుకొని పాట గూర్చికొనును!
మధురగాయకురాలిగా మహిని వెలయు

గీ. మధుర గానము వినిపించి మంజులముగ
దేశభక్తిని వెలయింపు దీప్తిగాగ!
భరత మాతను బూజింప భవ్యగీతి
సందుగొందుల వినిపింపు విందుగాగ!

గీ. వీధులందునబాడగ విసువు బడకు!
వీధులందున గలదుగా విపులశక్తి!
రక్తధారల తడిసిన రమ్యభూమి
ప్రజలు ప్రగతికై నడిచిన భవ్యభూమి!

గీ. అదిగో! యచ్చట యొలికెను రక్తధార
మడుగు కట్టిన దచ్చటే మారెరంగు!
అమర వీరుని స్మృతి చిహ్నమదిగొగనుము!
మదిని జిత్రించుకొనుము నా మహిత గాథ!

గీ. దేశభక్తియె వానికే దశను దెచ్చె!
మాతృ భక్తియె వాని కా మరణమొచ్చె!
ప్రజలమేలును గోరెడి ప్రగతిశీలి
కెట్టి గష్టములొచ్చెనో కట్టు పాట!

గీ. అదిగదిగో! వీరనారులు వీధినిలిచి
మాతృభూమికి జైయని మధురగీతి!
బాడ, తూపాకి గుండ్లను బడినగాధ!
వీరగీతిని బాడుము వీధులందు!

గీ. అదిగో నచ్చట జన సంఘమంత లిలిచి!
"మాకుగావలె స్వాతంత్ర్య మనుచు బలుక!
కఱకు గుండెల వారల గఠినమైన
గుండ్లవర్షపు గుఱియైన గుర్తులివిగో!

గీ. అదిగో! యాతెలుగోడల యంచులందు!
నురుగు డీయగ బడినట్టి ధీరులెంత!
మందియో యెంచి దుఃఖముఱిందతేము!
కటిక చీకటి తెరలుగ కథల నన్ని!

గీ. అట్టి వీరుల కథలను నల్లవోయి!
ఇట్టె వినిపింప వోయి నీ విమల స్వరము!
వినుచు జాతి చైతన్యమై వేలవీరు
లవతరింతురు ధరణిపై కవనమహిమ!

గీ. ఎందఱో దేశభక్తులు చిందిరక్త
ధారలో రదలై పారగా ధరణితడియ
భారత మాతకు స్వేచ్ఛను భావిభాగ్య
మునకు బాటలు వేసిరి మోదముననను!

గీ. అట్టి త్యాగము గ్రహణముపట్టె, దారి
దప్పినడుచు చున్నది గని త్రిప్పి దాని!
యొప్పుదారి మళ్ళింపగా నొనర జనులు
పూనికను జూపి ప్రతనను బూనవలయు!

గీ. కార్మికుల కర్షకులకంటి కలతలేని
ప్రభుత నిర్మింపవలయు ప్రమోద మొప్ప
అన్ని వర్గాలప్రజలును నలతలేని
జీవితము సాగవలయు నూ! శ్రేయమొసగ!

గీ. సమసమాజము నిర్మించి చక్కనైన
నవ్యభారత నిర్మాణ నవతవెలయ
సమత మమతలు వెలుగొంది సంఘమంత
మానవత్వపు విలువలు మరులుగొలుప!

గీ. అట్టి సంఘము నిర్మించునట్టి దనుక
నీకు నాకును నిసుమంత నిలుపు లేదు
శాంతియును లేదు! సజ్జన సంఘమునకు
కదులుమోయి కాళ్ళడకసు గడలిదనుక!

గీ. సుందరంబిది సువిశాల శోభనంబు
భవ్యభారతమిది మన భాగ్యసీమ!
అందచందాల భూమిరా! యఖిలలోక
మందు గలదంతయును జాడు మిందుగలదు!

గీ. అన్నిమతముల కిది యొక యాటబట్టు
ఎన్నో భాషలు జాతులు నింపుగలది
అన్నివర్గాలు గలియుదు రొక్కటనుచు
సహన శీలతగల ప్రజ సహజప్రజ్ఞ!

గీ. మాలయందలి పూవుల పోల్కి మధుర
వర్ణమాల పోలిక నొప్పు నింద్ర ధనుసు
వోలెనింగి చుక్కల వెల్లు వోలె, రవల
రాళ్ళు బొదిగిన హారము రమ్యరీతి!

గీ. మూడువైపుల సంద్రము ముచ్చటగను!
పూర్వదక్షిణ బడమర దొలుకుచుండు!
ఉత్తరపు దిశ గలదదె! నుర్వియందు
గొప్పదైన హిమాలయ గోపురంబు!

గీ. కిన్నెరను బట్టి జేతను గీర్తనలను
మాతృదేశపు మహిమను మధురముగను!
పాడుచును మేలు కొలుపుము బ్రజలనంత
నూత్న చైతన్య ప్రజలను నూలుకొలిపి!

గీ. తూర్పు దిశ బొమ్మ! హృదయము మార్పులేక
ఓఢ్ర దేశీయులును మఱి వరుస వంగ
దేశ ప్రజకానిపింతురు దీక్షతోని
శ్రావ్యముగ బాడు మచ్చుట సరసగీతి!

గీ. బొమ్మ! దక్షిణ దిశను సంద్రంబుదాక
ఆంధ్ర కన్నడ కేరళ యరవలుంద్రు
మాతృదేశపు మహిమను మధురముగను
కొరిగొంతెత్తి బాడుము గోర్కెదీర!

గీ. మంచుకొండదె! యుత్తరమందు గలదు
పదము బాడుచు పద! ప్రజపల్లవింప
కనక కాశ్మీర భూములు గలవు జూడు!
స్వర్గభూమది పుడమిలో స్వర్ణభూమి!

గీ. అటులె పశ్చిమ భూములఁ బాఱజూడు
వివిధ జాతుల ప్రజలను వేగలేపి
దేశ భవితవ్యమును దీర్పు ధీరతముగ
పాట బాడుము నీ నేర్పు ఫణితి మెరయ!

గీ. ఎచటకేగిన యేమూల యేచటనున్న
జన్మభూమిది భారత కర్మభూమి
మతము జాతులు భాషలు మఱచి బొమ్మ
నందఱొకటిని భావింపు నార్ద్ర దృష్టి!

గీ. మతము కులములు వేఱని మమత మీద
భాషవేఱంచు ప్రాంతీయ పట్టుదలల
దేశ మంతయు విచ్ఛిన్న దీన దశకు
దరలుచున్నది గనుమోయి! త్వరితగతిని!

గీ. హెచ్చుదగ్గను భేదముల్ మచ్చరమును
పెచ్చు పెరిగిన దిప్పుడు నుచ్చనీచ
తార తమ్యముగూడను దరుగులేదు!
ఎందుకొచ్చిన స్వేచ్ఛయో యెఱుకబడదు!

గీ. దేశమిది నాదియను మాట లేశమయ్యె
దేశ ప్రజలను మఱచిరి దేశనేత
లింకమఱియేది దిక్కంచు నెవరిదయను
గోరగలరింక ప్రజ మఱి ఘోరకలిని!

గీ. విందులును విలాసము లిలనందములును
సందడులు యెక్కువాయెను సర్వజనులు!
సుఖము సౌఖ్యముధనముకై శూన్యమునకు
జనుచు నుండిరి గనుమోయి సానుభూతి!

గీ. ఇటుల బోయిన దేశము నింక నొక్క
సారి పరదేశ పాలన సరగు నొచ్చి!
బానిసత్వపు సంకెల బట్టువడుదు
మిక జెప్పంగ వలసిన దేమికలదు?

గీ. ఇందుకే నిన్ను బిలుచుట నందముగను
పాట బాడగ నేర్చియు భవ్యకవిత!
ఇంపు మీరగ చందస్సు సొంపుగూర్చి
దేశ ప్రజలను మేల్కొల్పు! దీరవాణి!

గీ. మతము లెన్నున్న యొక్కటే మనిషి మతము
సాధనా మార్గములు యెన్నొ సరసరీతి
నొక్కటే గమ్యమని దెల్పు! నొక్కదేవు
డనుచు బాడుము సత్యము! నదియె ప్రేమ!

గీ. ఐకమత్యము బలమని యెఱచి పలుకు
విడిన జెడెదము! గావున వేఱుబడక
కలిసియుండిన సుఖమని కమ్మనైన
పాటబాడుము లయతాళ బద్ధముగను

గీ. ఐకమత్యము శూన్యమై యగుట కాదె?
గతము నందున నొందిన ఘాతుకముల
మఱువబోకుడు! యనుచును మఱలబాడు!
మనసునందున గుఱి జేసి మర్మముగను!

గీ, ప్రాంతకుల భేదభావాల బరగ విడిచి
సామరస్యముతో నుండ సకలకార్య!
ప్రగతి జరుగును మనమంత భరతమాత
ముద్దు బిడ్డలుగావ టే మోదమొప్ప!

గీ. కలహముల మానుమని దెల్పు కఠినమైన
కఱకుదనమేల యనుచును క్రాంతి ప్రగతి!
దారి నడుపగ బిరిగొల్పు ధర్మగతిని!
విడువకండని బాడుము! విమలగీతి!

గీ. సంఘమందున గలదురాచారములను
మాన్పివేయగ బిరికొల్పు మనుజులందు!
కష్టములుతెచ్చు నట్టివి! కలతనలత
దెచ్చునట్టివి కావున మచ్చ కాదె?

గీ. అధిక సుఖ లాలసత్వము నధికమైన
ముప్పుదెచ్చునుగాదె! యామూలముునను!
హద్దు మీరగరాదు సూ! యధిక సుఖము!
మూల్య మివ్వగ వలయును ముందు ముందు

గీ. అంకురానివి ప్రకృతియందు గలదె?
సర్వమును దేవదేవుని సరసలీల!
దూరముగ నుండు మనుచును దూరునట్టి
దురిత మదికాదె? మనమంత దూరవలదె?

గీ. దేశభక్తిని గలిగించి ధీరజనుల
చేయవలయును దీప్తిని జేర్చి కూర్చి!
సంఘజనులంత సుఖమును సౌఖ్యములను
నందజేయగవలయును నమిత కృషిని!

గీ. పాట బాడుట వినుచును బల్లవించు
కవితమదిమెచ్చుకొనుచును కంఠసీమ!
పూల మాలల వేతురు పుడమి జనులు!
హర్షమున పొంగిపోకుము! నదియెముప్పు!

గీ. మెచ్చుకోలును గోరకు! మేకవన్నె
పులివి గాబోకుమా! మది పొలుపు మీర
నేతగావలెనని పూని నింగి నంటు
జయజయ ధ్వనుల గోరకు! జరుగు ముప్పు!

గీ. ఎవరి వనుచును నినుజూచి యెందువాడ
వనుచు బ్రశ్నింప జనులకు వినయమొప్ప!
"వీధిగాయకుడనని బల్కు" విందుగూర్చు
పదము "బాడు! భారతవాసి"ననుచు!

గీ. గ్రామగ్రామము బయనించు కాలినడక
వీధి వీధిని బాడుము, వేడుకలర!
నదులు కొండలు దాటుకు! సదమలముగ!
ప్రజకు వినిపింపవోయి! నీ ప్రగతిగీతి!

గీ. కట్టుబట్టలు దుప్పటి కలిపి చిన్న
మూటగా నిడుకొను చిన్ని! మూపునందు!
చేత కిన్నెర దప్ప నీ చేతనింక!
వస్తుసామాగ్రి వలదు సూ! వలనుబడెదు!

గీ. ఎవరు నేమేమి జెప్పిన వివరముగను!
నాలకింపుము నతిశ్రద్ధ! యూర్ధ్వ దృష్టి!
పేదసాదల గోడుల వేదనలను
సేద దీర్పగ బలుకుము చిన్నమాట!

గీ. చింకిపాతల ధరియించి చిన్నిగుడిసె
లందు నివసించువారల, సందుగొందు
లందు వసియించు వారలు నందియిచ్చు
అన్నమును భుజియింపుమా! నాత్మతృప్తి!

గీ యాత్ర యతిదీర్ఘమైనది! యంతులేని
యాత్ర! యిది యాగిపోనిది! చి[illegible]మైన
యాత్ర! ప్రగతికై పోరుసల్పు యాత్రయిది!
మానవత్వము వెలయించు మధురయాత్ర!

గీ పేదసాదలు బెట్టిన పిడికెడన్న
మును తినుము మెచ్చి కడుపార మోదమలర
గంజిలో నుప్పులేదని కలతబడకు
కూరలేదని రొట్టెలో గొణుగుకొనకు!

గీ. దారిబత్తెము గోరకు! దయను నెవరి
చేయి జూపకు! చిత్తము బేలపడకు
డస్సిపోవకు! భయమున డాబుదర్ప
ములకు లొంగిపోవకు! జారికలతబడుచు!

గీ. కటిక దారిద్ర్యమును మాపి కమ్మనైన
బ్రతుకు బాటను జూపెడి ప్రగతి యాత్ర
అంధ తమసును మాపుచు నమిత దివ్య
మహసులను వెలయించెడి మధురయాత్ర

గీ. అన్నిమతముల నున్న యా యాత్మ విభుడు
అఖిల జీవులనున్న వాడనుచు దలచి
యఖిల జీవుల ప్రేమించు నంతరంగ
వాసులనుగాగ దలపుము! నాత్మ నలరి!

గీ. భాషలన్నిటి దలపుము భవ్యముగను!
వాణి క్రీనీడలని దలచి మనసు పొంగ!
వానిలోగల వన్నెల వరుస నేర్చి
తీపిపాటలలో బోదిగి తేనెలొలికి!

గీ రమ్యమౌ ప్రకృతిని యంత రంగుమీర
యీశ్వరుని లీలయనుచును నెంచిమదిని!
వివిధ ప్రాంతాలనున్న యా విమలమైన
నదుల, గిరులను, యడవుల మదిని నిలుపు!

గీ. పాటబాడుచు కిన్నెర మీటి జనుల
యాత్మ చైతన్య వంతుల నలరజేసి
క్రొత్త జగతిని నిర్మింప కోర్కెరేపి
నవయుగోదయ మార్గంబు నాట్యమాడ!

గీ. అంతులేనిట్టి యాత్రలో యలత గలుగ
నిలిచి విశ్రాంతి గొనుమయ్య! నింగి క్రింద
తరువు క్రిందను లేక యేసత్రముననో
నిలుము నిరుపేద గుడిసెలో కలతలేక!

గీ. ప్రాణమాగిపోయెడిదాకను ప్రగతిగీతి
యాపబోకుము! కిన్నెర నాపబోకు
గొంతుపోనంతవఱకు నీకోర్కె దీర
పాట నాపకు నెపుడును ప్రగతి శీలి!

గీ. పేదసాదల గుండెల గాథలన్ని
బ్రదుకు బాటలులేనట్టి బాటసారు
లవని బడు బాధలన్నింటి కవనమల్లి!
పెద్దగొంతున వినిపింపు ప్రతిధ్వనింప!

గీ. తిండి లేకను మరలలో బండచాకి
రిని యఘోరించు జనులను రేయిబగలు
వాంఛలను, గోర్కెలను మది వరుస దెలిసి
కరుణ రసమున వర్ణింపు గథలగూర్చి!

గీ. కూలిజేసినగూడను గుమిలి కుమిలి
గుప్పెడన్నము దొరుకక కుప్పగూలు
వారలెందరో గలరిల వరుస జూడు
వారి బాధల వర్ణింపు కరుణగలుగ!

గీ. సంపదల సృజయించుచు సకల సౌఖ్య
ములకు నాధారమగునట్టి మూలపురుషు
డైన శ్రమ జీవి శ్రమికుని వినతి యేమొ
తేటగీతిని వినిపింపు తెలియజనులు!

గీ. పుడమి తల్లిని బులకించు పుణ్య పురుష
డన్న దాతను మఱచుట పున్నెమగునె?
కర్షకుని కంటి నీటిని కథను గట్టి
యార్ద్ర భావము జిందగా నల్లుగీతి!

చదువుకున్నను గూడను సంఘమందు
జిన్ని యుద్యోగమైనను జిదుపలేక!
వ్యర్థులై వీథులందున నర్థరహిత
బ్రతుకు భారుల వర్ణింపు బాధగలుగ!

స్త్రీల దుఃఖాగ్నులను దెలుపు జిత్రకథలు
వరుస లెక్కింప లేముగా వాసనన్ని
ఒక్కటొకటిగ బాడుము! జిక్కులన్ని
వేగదొలగింప ప్రజలకు వినతిసేయి!

గీ. బ్రతుకు బాటలు లేకను బాధబడుచు
కుమిలిపోయెడి వారలు కోట్లు గలరు
ఆత్మహత్యల కత్తెర లందునలిగి
తల్లడిల్లెడి వారల దలచు కొనుము!

గీ. దిక్కులేనట్టివారలు దీర్ఘవేద
నలను దపియించు వారలు నిలనుగలరు
కంటి నీటిని దుడుపగ కథలనన్ని
తెలుపు ప్రజలకు బోధగా నలతజింద!

గీ. వీరగాథలు బాడుము! వెతలనందు
దీనజనులను బాడుము! దేశ భక్తి
మొలకలెత్తగ జేయుము! మోదమలర!
యుత్తడిని పుత్తడిగ జేయుమింపు మీర!

గీ. ఇట్టి సువిశాల భారత మంతనాది
యీ మహా ప్రజలందఱు నిచటి ప్రకృతి
యణువణువు నాది యుచ్చ్వటి యారిపోని
యమర సంస్కృతి యంతయు నాదటంచు!

గీ. గొప్ప నేను! నా దేశము గొప్ప యనుచు
గిరిని గీయుట పతనము గోరుకొనుటె
ఉన్నతోన్నత భావన నుర్వినంత
మొక్కఁజేయని దలపుము! మక్కువగను!

గీ. మార్గమధ్యమునందున మధురమైన
గొంతు మూగవోయినగూడ మఱలవచ్చు
కోకిలకు వోలె ని గొంతు క్రొత్త పాట
మఱల బాడును మాధురి మమత జింద!

గీ. చివరదశ యందు గూడను జిత్తమాగి
పోవువేళను మాధవు దేవదేవు!
పిలుపు వచ్చిన యపుడును బ్రీతితోని
మాతృభూమిని దలపుము! మనసునందు!

గీ. చివఱి కోరిక గోరుము! చిద్విలాసు
మఱల మానవ జన్మము మమతనిచ్చి
హాధి పాటకునిగ యిల విమలమైన
భరత భూమిని బుట్టగా భావకునిగ!

గీ. భారమది యెంతయో గలది! బరువుగలది!
సాధ్యమిదిగాదు మొరులకు చారు శీలి!
వగుట నీక జెప్పితిగావున నిర్వహించి!
మాతృఋణమును దీర్పుము! మమతదీర!

గీ. ఎందఱో దేశభక్తులు, నెన్ని విధము
లుగనో సేవ జేసిరి గాన జగతి ప్రజల
సేవజేయుము నీవును శ్రీలుగలుగు
పుణ్యభూమిని సేవింపు స్ఫూర్తితోను!

★★★★

# బాటసారి

## ఖండిక

గీ. పయన మెచ్చటి కంచును ప్రశ్న వేసి
యడుగ బోకుడు నన్నిటు నలత కలత
యంబరము దాటిపోవలె యఖిల జగతి!
వన్నె చిన్నెల గాంచగా వాంఛనాకు!

గీ. నీలిగగనము నందున నిర్మలముగ
తారగానిల్చి సకలము సర్వసృష్టి!
కన్నులారగ జూడగ కాంక్షనాకు!
చిన్ని పాపగ నవ్వుచు జిందులేయ!

గీ. మబ్బు మైదానముల యందు మనసు విరియ
బరుగులెత్తగ నాకోర్కె బడుచు లేచి!
ఎత్తుపల్లములందున యెగిరిదూకి!
సమతలంబుల జారగా సహజవాంఛ!

గీ. చందమామను నేజేరి యందముగను
వెన్నెలంతయు నేద్రావి వేడ్క మీర
చిన్ని తారగ నేమారి వన్నెలెగయ!
కడలిలో నీడ గాంచగ కాంక్షనాకు!

గీ. మెఱుపు కన్నెల జతగూడి మేనికాంతి
యందములు జింద యాకాశ మంతటయును!
దీప కళికకు వలె నేను దేజమలర
నిలిచిపోవగ నా కాంక్ష! నిర్మలముగ!

అంచ బారుల యందున యలరి వెలగి
బరుగు లెత్తగ నే గూడ బరవశించి!
వంపు సొంపుల దిరుగుచు వన్నెలొలుకు
తోరణమునందు జతగూడి దొలుకకోర్కె!

ధ్రువుని జుట్టెడి జుక్కల తోరణమున
సప్తఋషులును జనుచుంత చక్కనైన।
చుక్కగా నేను వెన్నంటి చోద్యముగను।
భక్తిపాటలు బాడగా బరగు వాంఛ।

ఇంద్ర ధనుసున రంగులు యేడుదొలుక
రంగురంగుల రమణీయ భంగులమర!
మంచిముత్తెపు దండగా మంజులముగ
భువికి వ్రేలాడ నాకాంక్ష స్ఫూర్తి మెరయ!

సంజకాంతులు దూర్పున సహజరీతి
కుంకుమల రంగవల్లులు గూర్మిదనర।
మబ్బుతునకగ నేమారి మధురమైన
అందమైనట్టి బొమ్మగా నలరకోర్కె!

వేగు జుక్కయు బొడవగ విరియదూర్పు
కాంతిరేకలు దొలుకాడ గలతనొంది।
చీకటులు జారిపోవగ చిత్రముగను
పాలపిట్టగ నేమారి పలుక కాంక్ష!

అస్తమించెడి సూర్యుని యరుణకాంతి
కొలకులందున గుంకుమల్ లలితముగను!
కదిపివేసిన సీటిని గలువదీగె।
కదుపు యలవలె నేమార గలదుగోర్కె!

గీ. అస్తమించిన రవిగని విస్తుపోయి
ముసుగువేయగ పద్మిని ముడుచుకొనిన
రేకలందున తుమ్మెద రీతినుండి
విరహ గీతిని వినగోర్కి విపులరాత్రి!

గీ. చంద్రకాంతులు నిండిన సాంద్ర నిశిని!
కలువలన్నియు విప్పారి కాంతిజింద!
మావికొమ్మను గూర్చుండి మధురముగను
కోకిలగ మారి కుహుయని గులుక కోర్కి!

గీ. నెమ్మితన పింఛమును విప్పి నేర్పుతోని
నల్లమబ్బుల గమిగాంచి నాట్యమాడ!
రాగలయతాళ యుక్తిని రమ్యమైన
పాట నేబాడ వాంఛింతు బరవశముగ!

గీ. కొండకోనల కుహుకుహు కూయటంచు
పాటబాడెడి కోయిల బరవశించి!
గండుకోయిల రీతిగ కంఠమెత్తి!
గొంతు గలుపగ నా కోర్కె కొసరి కొసరి!

గీ. పచ్చి శృంగారమంతయు విచ్చునటుల
వలపు జంటల ప్రేమలు వొలకబోయ!
పడవలాగెడి పల్లియ బదములోని
మధురభావమునై యుండ మనసు కోర్కె!

గీ. ఆల గాచెడి బుడ్డోడి యచ్చమైన
పిల్లనంగ్రోవి పాటను బ్రీతిచింద!
రాగతాళము లయలతో రమ్యమైన
పాటబాడగ నా వాంఛ బరమప్రీతి!

గీ. నిర్మలంబైన సెలయేటి సీటియలల
మధుర శబ్దము ధ్వనియింప మంజులముగ!
తీయతీయని భావముల్ తేనెలొలుక
పాటబాడగ నా కోర్కె బరవసించి!

గీ. అలల యందున్న దేదియో యమరశక్తి
మనసు నృత్యము జేయును మాటలన్ని!
పాటగా రూపు గైకొను బరవసించి
ఆత్మ యమరత్వమొందును యబ్బురముగ!

గీ. చిన్నిమొగ్గగ తలయెత్తి చిగురులందు
రేకలను విప్పి పుష్పించి రేయిబవలు!
తావులను జింది భూమాత తనువునందు
నాత్మ నర్పించుకొను రీతి యలర కోర్కె

గీ. కష్టముల జిక్కి కడివెడు గంటనీట!
అష్టకష్టములందున యలమటించు!
దీనమానవు బ్రతుకున దీప్తి దొలకు
కాంతిరేఖగ కనిపింప కాంక్ష నాకు!

గీ. ఆశలన్నియు యడుగంటి యలసి సొలసి
బ్రతుకు కోసము బయనించు బాటసారి!
కారు జీకటి క్రమ్మిన కాలరాత్రి
తూర్పు దొలిరేఖ మాదిరి దొలుక కాంక్ష!

గీ. గాఢనిద్రను దమసును కడకుద్రోసి
నిదుర మేల్కొనుమనుచును నిఖిల జనుల!
నూతనోత్సాహములతోని నూతమిచ్చు
కోడికూతగ మేల్కొల్ప కోర్కె నాకు!

గీ. బ్రతుకు బరువును మోయగ బరువులేక
బాట దెలియని బ్రతుకుల బాధదీర్చ
ముందు కడుగిడ గమ్యము నందుకొనగ
దీపరేఖగ వెలుగును జూప కోర్కె!

గీ. బ్రతుకు సుడులను దిరుగుచు బాధలందు!
దరిని జేరగ తపియించు దత్పరులను!
కంటనీటిని జేదుడిచి కమ్మనైన
మంచి మాటను మాటాడ మదినిగోర్కె!

గీ. అల్లిబిల్లిగ దిరుగుచు నందమైన
పాటబాడుచు దీయగ బరువులెత్తి!
తల్లిపాదాల కౌగిలి నల్లుకొనెడి
చిన్నిపాపల మువ్వనై చెంగ కాంక్ష!

గీ. వర్షధారల యందున వన్నెలొలుక
పుడమి యంతయు దడియగ బులకరించి!
చిన్నపిల్లలు గట్టెడి చిత్రమయిన
యిసుకగూడుగ నే జింద నీప్సితంబు!

గీ. వర్షధారల యందున హర్షమొలుక
నీటికాల్వలయందున నిర్మలముగ!
చిన్నపిల్లలు వొదిలేటి చిన్నిదైన
కాగితపు నీటి పడవనై కదల కోర్కె!

గీ. పొగలయందున మరలలో భొగిలిభొగిలి!
సరుకునుత్పత్తి గావించి సంపదలను!
సృజన మొనరించు శ్రామిక జనులనుదుటి
స్వేద బిందువునై ధర జింద కాంక్ష!

గీ. చదువు రానట్టి యన్నుల సరసజేరి
జ్ఞానదీపిక వెలిగించి జటిల మడచు
మాననీయుల మధురమౌ మాటలందు!
వర్ణమాలగ వెలయగ వాంఛ నాకు!

గీ. ప్రజలమేలుకు దపియించి ప్రగతికోరకు
ప్రాణముల నొడ్డి రక్తము ధారధరణి!
వీరుల సమాధులందున గౌరవముగ
తులసి మొక్కగ నేవెలసి దోలుక కోర్కె!

గీ. పట్టువిడువని వీరుని ప్రగతి శీలి
యడుగు వెనుకకు వేయని యమలవ్రతుని!
కర్మవీరుని జతగూడి కలిసి మెలసి
ఆత్మ సహచరుగా నుండి యలర గోర్కె

గీ. దూర పయనము గావించు దోడులేని
బాటసారిని దరిజేరి మాటబలికి!
ఆకలిని దీర్చి యాదర మొప్పనతని
సాగనంపగ నా కోర్కె సఖునివోలె!

గీ. భూమి బీటలువారగ బొలుపుదరిగి
ఆకసమువంక జూచెడి యవనిమాత!
ఉఱుము మెఱుపుల దోడుత నుర్వియదర
మేఘ మాలగ వర్షింప మేల్మివాంఛ!

గీ. విరహ వేదన దపియించి వేయికనుల
కృష్ణుగాంచగ శ్రీమురళీ నిశ్వనముల!
వినగ వాంఛించు గోపిక విరహగీతి!
మధుర భక్తిని నే జింద మధుర కాంక్ష!

గీ. స్వాతివానను గోరుచు సాదరమున
యాలు జిప్పలు నోళుల నట్టెదెరువ!
వర్షబిందువుగా కోర్కె వన్నెలొలుక
మంచి ముత్తెముగా మారు మహిమ జెలగి!

గీ. నవవసంతము జగతిని నాట్యమాడ
చివురు బూవులు జిందగ చిత్రగతిని!
మావి కొమ్మను నేనొక్క మధువు జిందు
చిన్ని పూవుగ వెలయగ చిన్ని కోర్కె!

గీ. నవసమాజము నిర్మింప సర్వజనుల
సుఖము సౌఖ్యము గోఱకునై శుభము గూర్చు!
క్రొత్త జగతిని నిర్మించు కోటిప్రజల
మధుర యుత్సాహ రేఖగా మనగవాంఛ!

గీ. తల్లి యొడియందు నిద్రించి దస్మయముగ
చందమామయు దారలు నందమొప్ప
ఊయలూపగ యానంద యూహదేలు!
పాప చిఱునవ్వుగా దేల బరగకాంత!

గీ. మంచిజేయగ యత్నించు మానవునకు
విఘ్నములు గల్గినను గూడ విమలమైన!
మనసు మారక యత్నించు మఱల మఱల
అట్టి సుజనుని దీక్షగా నలర కోర్కె!

గీ. యోగి మానస మందున రాగద్వేష
ములను దలపుకు రానీక మోదమునను!
చిత్తముల హరి పదముల జేర్చు భక్తి
అట్టి యేకాగ్రతను నేను నలర కాంక్ష!

ఆ. మనిషిలోనున్న మలినము మాపివైచి
సజ్జనత్వము బరిధుల సరసరీతి!
మించి దేవత్వమును నందు మంచి మనసు
దివ్యతత్త్వము నందున దేలకోర్కె!

ఆ. పాపపుణ్యము నీ భూమి బరగియుండు
చెడును వెదనాడు! మంచిని జేయమనుచు
కోవెలను మ్రోగు జయఘంట మార్మిధ్వనుల
మనసు జేర్పగ నాకోర్కె మానితముగ!

గీ. ఎన్ని కష్టములొచ్చిన యెన్ని శ్రమలు
గలిగినను గూడ కష్టాల గడకుద్రోచి
పెదవి చిఱునవ్వు జిందుచు కదముద్రొక్కు
మనిషి మోమున కాంతిగ మనగకోర్కె!

తే. సప్త స్వరముల బరగుచు సప్తరీతి
స్వర్గ ద్వారములనబడు సరిగమలను!
మనసు ధ్యానించు చుండెడి మాన్యవరుల
భక్తిసేవలు సేయుంగ భవ్యకాంక్ష!

గీ. ముక్తి ద్వారము జూపించి మోదమునను
భక్తి రక్తిని గలిగించి భవ్యమైన
చిత్తశాంతిని గలిగించి శ్రీలజిందు
రాగ మందున నాదమై యూగ కాంక్ష!

తే. వెన్నెలందున సెలయేరు సన్నజాలు
అందముగ ధ్వని జేయుచు జిందులాడ
పూవుగా దేలిపోవుచు పొదల దరుల
మధురిమల జింద నా కాంక్ష! మంజులముగ!

గీ. దూరమేగెడి బధికుని తోడనుండి
కొండ కోనల దాటించి కూర్మిదనర
మంచిమాటల మనసును మధురిమలను
పూలుబూయింప నా కోర్కె! ఋలకరింప!

గీ. యుద్ధ మేఘాల దొలగించి యున్నతముగ
దేశదేశాల ప్రజలంత దీక్షనంది
శాంతి గీతము పాడగ దిశలనన్ని
మధురనాదము మార్మోగ మదురకాంక్ష!

గీ. లలిత గీతమునందున లాలితముగ
మధుర పదముల కూర్పులో మంజులముగ
తొలుకు భావము నేనౌదు విలసితముగ
వీనులకు విందు నొసగుచు విమల రుచుల!

గీ. మంగళంబగు బుధమికి మంగళంబు
మంగళంబగు జనులకు మహితశక్తి
సమసమాజము మమతయు సరసరీతి
శాంతి వర్ధిల్లుగాత! యీ సకలమునకు!

సంపూర్తి



